(శ్వా) విశ్వకద్రు (ర్మృగయాకుశల) సరమా శునీ, విట్చర (స్సూక రో గ్రామ్యో) బర్కర (స్తరుణః పశుః). ౭౧౦

విశ్వకద్రుః ॥పు॥ ౧-మృగయాకుశలః=వే యందు నేర్పుగల, శ్వా=కుక్క పేరు. Hou

సరమా-శునీ ॥స్త్రీ॥ ౨ - ఆఁడుకుక్క పే

విట్చరః ॥పు॥ ౧-గ్రామ్యః- సూకరః = ఊ బంది పేరు. H

బర్కరః॥పు॥ ౧ - తరుణః=ప్రాయపువయ గల, పశుః=పశుమాత్రమునకు పేరు.

ఆచ్ఛోదనం మృగవ్యం (స్యా) దాఖేటో మృగయా (స్త్రియామ్),

ఆచ్ఛోదనమ్ - మృగవ్యమ్ ॥న॥ - ఆఖే ॥పు॥-మృగయా ॥స్త్రీ॥౪-వేటపేళ్ళు. Cha

(దక్షిణారు ర్లుబ్ధ యో గా) ద్దక్షిణేర్మా (కురఙ్గకః). ౭౧౧

దక్షిణేర్మా॥న్-పు॥ ౧-లుబ్ధయోగాత్=వే కాని బాణముతగులుటవలన, దక్షిణారుః = ద దిక్కునగాయముకల, కురఙ్గః=మృగముపేరు

చో రైకాగారిక స్తేన దస్యు తస్కర మోషకాః, ప్రతిరోధి పరాస్కన్ది పాటచ్చర మలిమ్లుచాః. ౭౧౨

చోరః (పా) చౌరః - ఐకాగారికః - స్తే దస్యుః - తస్కరః - మోషకః - ప్రతిరోధీ పరాస్కన్దీ ॥న్॥ - పాటచ్చరః - మలిమ్లుచః ౧౦-దొంగలపేళ్లు. Robb

చౌరికా స్తైన్య చౌర్యే చ స్తేయం లోప్త్రం (తుతద్ధనమ్),

చౌరికా ॥స్త్రీ॥ - స్తైన్యమ్ - చౌర్యమ్ - స్తేయ ॥న॥౪-దొంగతనముపేళ్లు. Theft. [ము

లోప్త్రమ్॥న॥౧-తద్ధనమ్ = దొంగిలిం

వితంస (స్తూపకరణం బన్ధనే మృగపక్షిణామ్). ౭౧౩

వితంసః(పా) వీతంసః॥పు॥౧-మృగపక్షిణా మృగములనుపక్షులను, బన్ధనే=పట్టుటయం ఉపకరణమ్ = సాధనమైనయుఃరులు మొ దానిపేరు. Net; Ch

ఉన్మాథః కూటయన్త్రం (స్యా) ద్వాగురా మృగబన్ధనీ,

ఉన్మాథః॥పు॥-కూటయన్త్రమ్॥న॥౨-ఎ పేళ్ళు.గాలమునికొందఱు. Snare [వల

వాగురా - మృగబన్ధనీ॥స్త్రీ॥౨-మృగముల

శుల్బం వటారకః

శుల్బమ్ (పా) శుమ్భమ్ ॥న॥-వటారకః

స్త్రీతు రజ్జు స్త్రిషు వటీ గుణః. ౨౧౮

రజ్జుః ॥స్త్రీ॥-వటీ ॥త్రి॥ - గుణః ॥పు॥ ౩ - త్రాడు పేళ్ళు. Rope.

ఉద్ఘాటనం ఘటీయన్త్రం (సలిలోద్వాహనం ప్రహేః),

ఉద్ఘాటనమ్- ఘటీయన్త్రమ్ ॥న॥ -౨-అను, ప్రహేః = నూతివలన, సలిలోద్వాహనమ్ = నీళ్లెత్తురాట్నము పేళ్ళు.

(పుంసి) వేమా వాయదణ్డ

వేమా ॥న్-పు॥ [ప] ॥న॥ - వాయదణ్డః॥పు॥ ౨-కోకలునేయు తాఁకుపలక పేళ్లు. Loom.

సూత్రాణి(నరి)తన్తవః.

సూత్రమ్॥న॥-తన్తుః॥పు॥౨నూలిపేళ్లు. Thread

వాణి ర్వ్యూతిః(స్త్రియాం తుల్యే)

వాణిః-వ్యూతిః॥స్త్రీ॥ ౨-నేయుటపేళ్లు. Weaving.

పుస్తం (లేప్యాదికర్మణి),

పుస్తమ్ ॥న॥ ౧-లేప్యాదికర్మణి = లెప్పపుపని మొదలయినదానిపేరు. సాలెవాఁడు పడుగుచేయుపని పేరని కొందఱు. Modelling.

పాఞ్చాలికా పుత్త్రికా (స్యా ద్వస్త్రదన్తాదిభిః కృతా). ౨౧౯

పాఞ్చాలికా - పుత్రికా ॥స్త్రీ॥ ౨ - వస్త్రదన్తాదిభిః=వస్త్రదన్తకాష్ఠాదులచేత, కృతా = చేయఁబడిన బొమ్మపేళ్ళు. Puppet.

పిటకః పేటకః

పిటకః-పేటకః ॥పు॥ ౨-పెట్టెపేళ్లు.

పేటా మంజూషా౽

పేటా (పా) పేడా-మంజూషా ॥స్త్రీ॥ ౨-మందసము పేళ్లు. ఈరెను,పర్యాయములనికొందఱు.

థ విహఙ్గికా, భారయష్టి

విహఙ్గికా (పా) విహఙ్గమా - భారయష్టిః ॥స్త్రీ॥ ౨-కావడిబద్దపేళ్లు.

(స్తదాలమ్బి) శిక్యం కాచో౽

శిక్యమ్ ॥న॥-కాచః ॥పు॥ ౨-తదాలమ్బి = ఆకావడిబద్దయందు వ్రేలు ఉట్టిపేళ్ళు.

థ పాదుకా. ౨౨౦. పాదూ రుపానత్ (స్త్రీ)

పాదుకా - పాదూః-ఉపానత్ ॥హ-స్త్రీ॥ ౩-చెప్పులపేళ్ళు. Shoe

(సైవా) నుపదీనా౽(పదాయతా),

అనుపదీనా ॥స్త్రీ॥ ౧ - అపదాయతా = కాలికి కొద్దిదైన, సైవ=ఆచెప్పు పేరు. Boot.

సద్ధ్రీ వర్ధ్రీ వరత్రా

సద్ధ్రీ - వర్ధ్రీ - వరత్రా ॥స్త్రీ॥ 3-వారుపేళ్లు.

కశా॥ స్త్రీ॥ ౧-అశ్వాదేః = గుఱ్ఱము మొదలయిన

సీ) కశా. ౨౧౫ | వానిని, తాడనీ=కొట్టుచబుకు పేరు. Whip

చాణ్డాలికా తు కణ్డో లవీణా చణ్డాలవల్లకీ. | చాణ్డాలికా-కణ్డోలవీణా (వ) కటోలవీణా చణ్డాలవల్లకీ ॥సీ॥ 3-మాలవానివీణపేళ్ళు.

నారాచీ (స్యా) దేష ణికా | నారాచీ-ఏషణికా ॥సీ॥ ౨-త్రాసుపేళ్లు. Scales, Balance. [సానపు

శాణ స్తు నికషః కషః. | శాణః-నికషః-కషః ॥పు॥ 3-ఒరగల్లుపేళ్లు.

వ్రశ్చనః ప త్త్రి పరశు | వ్రశ్చనః-పత్త్రిపరశుః॥పు॥ ౨-చీర్ణముపేళ్లు అగసాలవాని కొఱముట్టు. [కణిక పేళ్లు

రీషీకా తూలికా (సమే), | ఈషికా-తూలికా ॥సీ॥ ౨-చిత్తరువుప్రాయు

తైజసావర్తనీ మూషా | తైజసావర్తనీ-మూషా ॥సీ॥ ౨-బంగారు మొదలయినవి కరఁగుమూసపేళ్లు. Crucible

భస్త్రాచర్మప్రసేవికా. | భస్త్రా-చర్మప్రసేవికా॥సీ॥ ౨-కొలిమితిత్తిపేళ్లు

ఆస్ఫోటనీ వైధవికా | ఆస్ఫోటనీ (పా) లాస్ఫోటనీ-వైధనికా ౨-రత్నాదులు తొలులువేయు పిడిసానపేళ్లు

కృపాణీ కర్తరీ (సమే), | కృపాణీ-కర్తరీ॥సీ॥౨-కత్తెరపేళ్లు. Scissors

వృక్షాదనో వృక్షభేదీ | వృక్షాదనః-వృక్షభేదీ ॥న్-పు॥ ౨-మ్రాను నఱకుగొడ్డలికత్తియులి మొదలయినవానిపే

టఙ్కః పాషాణదార ణః. ౨౧౮ | టఙ్కః-పాషాణదారణః ॥పు॥ ౨-ఱాయి కెడు ఉలిపేళ్లు. Chisel

క్రకచో (౽స్త్రీ) కర పత్త్రం | క్రకచః॥పు॥కరపత్త్రమ్ ॥న॥ ౨-ఱంపపు వేళ్ళు.

స్యా దారా చర్మభే దినీ. | ఆరా-చర్మభేదనీ ॥సీ॥ ౨-ఆరెపేళ్ళు. 'క్రకచః కరపత్త్రంస్యా దారాచర్మప్రభేదికా' అనియుం బాఠము గలదు.

సూర్మి స్థూణా౽యః ప్రతిమా | సూర్మిః (పా) సూర్మీ-స్థూణా-అయఃప్రతిమా ॥సీ॥ 3-ఇనుపప్రతిమపేళ్లు.

శిల్పం(కర్మకళాదికమ్) ౨౨౨ | కళాదికమ్=వాత్స్యాయనుఁడుచెప్పిన గీతాదిబాహ్యక్రియలు-౬౪ను, ఆలింగన బన్ధాద్యాంతరక్రియలు-౬౪ను కళలనఁబడు

ప్రతిమానం ప్రతిబి
మ్బం ప్రతిమా ప్రతి
యాతనా ప్రతిచ్ఛా
యా, ప్రతికృతి రర్చా
(పుంసి) ప్రతినిధి
రుపమోపమానం
(స్యాత్). ౭౨౩

(వాచ్యలిఙ్గా) స్సమస్తు
ల్య స్సదృక్ష స్సదృశ
స్సదృక్, సాధారణ స్స
మానశ్చ
(స్యు రుత్తరపదే త్వ
మీ.)౭౨౪. నిభ సంకా
శ నీకాశ ప్రతీకాశో ప
మాదయః,

కర్మణ్యా తు విధా
భృత్యా భృతయో భ
ర్మ వేతనమ్. భరణ్యం
భరణం మూల్యం ని
ర్వేశః పణ (ఇత్యపి),
సురా హాలిప్రియా
హాలా పరిస్రు ద్వరుణా
త్మజా. గన్ధోత్తమా
ప్రసన్నేరా కాదమ్బ
ర్యః పరిస్రుతా, మది

30

అవి మొదలైనకర్మ - అనఁగా స్వర్ణకారాదిక్రియ
లును, శిల్పమ్ ॥న॥-శిల్ప మనంబడును. Art.

ప్రతిమానమ్-ప్రతిబిమ్బమ్॥ న॥-ప్రతిమా -
ప్రతియాతనా-ప్రతిచ్ఛాయా-ప్రతికృతిః-అర్చా
॥స్త్రీ॥ ప్రతినిధిః ॥పు॥౮-విష్ణువు మొదలయిన వారి
మూర్తులకు సమముగా శిలాదులచేతఁ జేసిన
ప్రతిమపేళ్ళు. Image

ఉపమా॥స్త్రీ॥-ఉపమానమ్ ॥న॥-౨-సరిపోల్పఁ
బడు వస్తువులకును సరిపోల్చుటకును పేళ్ళు. ౧౦౦౧

సమః - తుల్యః - సదృక్షః - సదృశః-సదృక్
॥శ॥-సాధారణః - సమానః॥ ౭-సమానవస్తువు
పేళ్లు. ఇవి విశేష్యములయొక్క లింగము గలవి.

నిభః-సంకాశః-నీకాశః - ప్రతీకాశః ॥పు॥- ౧౦౦౨
ఉపమా-స్త్రీ॥౫-ఆదిశబ్దముచేత కల్పభూత రూప
శబ్దములును, అవి=ఈ౫యు, ఉత్తరపదేస్యుః=
సమాసమునందు తుదిపదములయి సమానవస్తు
వుపేళ్లవును ఉదాహరణము—చన్ద్రనిభః,
పద్మసంకాశః - మొదలయినవి.

కర్మణ్యా-విధా-భృత్యా - భృతిః ॥స్త్రీ॥ భర్మ
॥న॥-వేతనమ్- భరణ్యమ్- భరణమ్-మూల్యమ్
॥న॥-నిర్వేశః - పణః ॥పు॥ ౧౧ - కూలిపేళ్ళు. ౧౦౦౩
Wages.

సురా-హాలిప్రియా - హాలా-పరిస్రుత్ ॥త్॥
వరుణాత్మజా - గన్ధోత్తమా - ప్రసన్నా-ఇరా-
కాదమ్బరీ-పరిస్రుతా - మదిరా ॥స్త్రీ॥-కశ్యమ్- ౧౦౦౪
మద్యమ్॥న॥౧౩-కల్లు పేళ్ళు. Liquor.

రాకశ్య మద్యే చాప్య వదంశ (స్తు భక్షణ
౧౦౦౯ మ్). ౭ ౨౭

అపదంశః (పా) ఉపదంశః ॥పు॥ ౧-మద్యపానము సేయునపుడు నంజుకొనుమాంసము మొదలయినదాని పేరు. భోజనమునందు నంజుకొనకూరుగాయ మొదలయినదియు. [ద్రాగునింటి

శుణ్డాపానం మదస్థానం మధువారా మధుక్రమాః,

శుణ్డా॥స్త్రీ॥ పానమ్ - మదస్థానమ్॥న॥ 3. మధువారః - మధుక్రమః ॥పు॥ ౨- పెక్కుమార్లు కల్లుద్రాగుపట్టుసపేళ్ళు.

మధ్వాసవో మాధవకో మధు మార్ద్వీక
౧౦౧౧ (మద్వయోః). ౭ ౨౮

మధ్వాసవః-మాధవకః ॥పు॥-మధు ॥న॥ ఇప్పపువ్వులకల్లుపేళ్లు. మార్ద్వీకమ్॥న॥౧-ద్రాక్షపండ్లకల్లుపేరు. ఇచట మార్ద్వీక మనుపాఠము నాలుగును ఇప్పపువ్వులకల్లు పేళ్ళు.

మైరేయ మాసన శ్శీధు

మైరేయమ్॥న॥౧-ఆరెపువ్వుబెల్లము కషాయము నీళ్లచేతఁజేసినకల్లు. ఆసవః॥పు॥౧-పక్వము గాని చెఱకురసముచేఁ జేసినకల్లు. శీధుః ॥పు॥ ౧-పక్వమైన చెఱకురసముచేఁ జేసినకల్లు. Ru

మేదకో జగల (స్సమౌ),

మేదకః- జగలః॥పు॥ ౨-మద్యము సేయుటకు నానాద్రవ్యములు గూర్చిన ముద్దపేళ్ళు.

సంధానం స్యా దభిషవః

సంధానమ్ ॥న॥ - అభిషవః ॥పు॥ ౨- సేయుటపేళ్ళు. Distillation

కిణ్వం (పుంసి తు) న
౧౦౧౩ గ్నహూః. ౭ ౨౯

కిణ్వమ్ ॥న॥-నగ్నహూః [ప] నగ్నహూ ॥పు॥ ౨-మద్యము సేయుమొలకపేళ్లు, నానాద్రవ్యకృతసురాబీజము. [కల్లు తేటః

కారోత్తమ స్సురామణ్డ మాపానం పానగోష్ఠికా,

కారోత్తమః ॥పు॥ - సురామణ్డమ్ ॥న॥ ... ఆపానమ్ ॥న॥ - పానగోష్ఠికా ॥స్త్రీ॥ ... కలిసి కూడి మద్యపానము సేయుచోటి...

చషకో (౽స్త్రీ) పానపాత్రం సరకో ౽ప్యనుతర్షణమ్.
౧౦౧౪ ౭ ౩౦

చషకః ॥పు॥ పానపాత్రమ్॥న॥-సరకః (... అపిశబ్దముచేత) ॥పు॥-అనుతర్షణమ్॥న॥ ... ద్రాగునట్టి పేళ్ళు. సరకానుతర్షణశబ్దము...

ధూర్తో ఽక్షదేవీ కితవో ఽక్షధూర్తో ద్యూతకృత్సమాః,
స్యుర్లగ్నకాః ప్రతిభువః సభికా ద్యూతకారకాః. ౨౩౧
ద్యూతో (ఽ స్త్రి)యామక్షవతీ కైతవం పణ (ఇత్యపి), (పణో ఽక్షేషు) గ్లహో ఽక్షాస్తు దేవకాః పాశకాశ్చ తే. ౨౩౨
పరిణాయస్తు శారీణాం సమన్తాన్నయనే (ఽస్త్రియాం), అష్టాపదం శారిఫలం
ప్రాణిద్యూతం సమాహ్వయః. ౨౩౩

౨-సు మద్యము నడ్డించుటపేళ్లనికొందఱు.

ధూర్తః - అక్షదేవీ ॥న్॥ - కితవః - అక్షధూర్తః - ద్యూతకృత్ ॥త్-పు॥ ౫-జూదమాడించువారిపేళ్లు. Gamester [వానిపేళ్లు.

లగ్నకః- ప్రతిభూః ॥పు॥ ౨ - పూఁటపడు

సభికః - ద్యూతకారకః ॥పు॥ ౨-జూదమాడించువానిపేళ్ళు.

ద్యూతః ॥పు॥ - అక్షవతీ ॥స్త్రీ॥ - కైతవమ్ ॥న॥-పణః॥పు॥౪-జూదముపేళ్ళు. Gambling.

గ్లహః ॥పు॥ ౧ - అక్షేషు - జూదములయందలి, పణః=పందెముపేరు. Wager

అక్షః- దేవకః (పా) దేవనః - పాశకః॥పు॥ 3-పాచికలపేళ్ళు. Dice.

శారీణామ్ = సారెలయొక్క, సమన్తాత్ = అంతట, నయనే=నడుపుటయందు, పరిణాయః ॥పు॥ పరిణాయశబ్దము వర్తించును.

అష్టాపదమ్ - శారిఫలమ్ - న్న॥ ౨ - నెత్తమాడుపలకపేళ్లు. జూదమాడుపలక.

ప్రాణిద్యూతమ్ ॥న॥ - సమాహ్వయః ॥పు॥ ౨-కోడిపందెము మొదలయినవానిపేళ్ళు.

మూ. ఉక్తా భూరిప్రయోగత్వా దేకస్మి న్యే ఽత్ర యౌగికాః,
తాద్ధర్మ్యా దన్యతో వృత్తా స్తూహ్యా లింగాన్తరే ఽపి తే. ౨౩౪

టీ. అత్ర=ఈశూద్రవర్గమందు, యౌగికాః = యౌగికములైన, యే=ఏమాలాకార మార్దఙ్గిక వైణవికాది శబ్దములు, భూరిప్రయోగత్వాత్ =ప్రయోగబాహుళ్యముగల వగుటవలన, ఏకస్మిన్ = ఒకపుంలింగమునందు, ఉక్తాః=చెప్పఁబడినవో, తే=ఆశబ్దములు, తాద్ధర్మ్యాత్ = ఆయాధర్మములు గలుగుటవలన, అన్యతః=స్త్ర్యాదులయందు, వృత్తాస్సన్తః = వర్తించుచున్నవై, లిఙ్గాన్తరేఽపి = స్త్రీలింగ నపుంసకలింగములయందును వర్తించుచున్నవియని, ఊహ్యాః= తెలియఁదగినవి.

తా. యౌగికములయి జాతివాచకములయిన కుంభకారాదిశ
ములు శూద్రాదిశబ్దములవలె పుంలింగ స్త్రీలింగములయందును వ
చుచున్నవనుట. ఉదాహరణము:—మాలాకారః పురుషః - మా
కారీ స్త్రీ - మాలాకారం బృన్దమ్ ఇత్యాదులు.

ఇతి శూద్రవర్గః = శూద్రులతోఁ జేరిన పదసమూహము ముగిసెను.

మూ. ఇత్యమరసింహకృతౌ నామలిఙ్గానుశాసనే,
భూమికాణ్డో ద్వితీయోఽయం సాఙ్గ ఏవ సమర్థితః. ౧౯

టీ. ఇతి=ఈపూర్వోక్తమైన, నామలిఙ్గానుశాసనే = నామలింగా
నుశాసనమను, అమరసింహకృతౌ = అమరసింహుని గ్రంథమునం
అయమ్=ఈ, ద్వితీయః=రెండవదైన, భూమికాణ్డః = భూమికాండమ
సాఙ్గఏవ=సమగ్రముగానే, సమర్థితః=నెఱవేర్పంబడెను.

నామలింగానుశాసనమున ద్వితీయకాండము

సంపూర్ణము.



శ్రీ ర స్తు.

# అ మ ర కో శ ము, స టీ క ము.

## తృ తీ య కాం డ ము.



అవ. గ్రంథకర్త చదువువారికి సులభముగాఁ దెలియుటకై యీ సామాన్యకాండమునఁ జెప్పఁగలవర్గలను వానికిఁ బూర్వకాండముల యందుఁ జెప్పఁబడిన వర్గలతోఁ గలసంబంధమును జెప్పుచున్నాఁడు:—

మూ. విశేష్యనిఘ్నై స్సంకీర్ణై ర్నానార్థై రవ్యయై రపి,

లిఙ్గాదిసఙ్గ్రహై ర్వర్గా స్సామాన్యే వర్గసంశ్రయాః. ౧౦౧

టీక. సామాన్యే = పూర్వకాండములకు సాధారణమైన యీసామాన్యకాండమునందు, విశేష్యనిఘ్నైః=విశేష్యముతో సమానమైన లింగాదులుగలపదముల చేతను, సంకీర్ణైః=పరస్పరవిరుద్ధములైనకర్మపారాయణపరస్పర ప్రభృతిశబ్దములచేతను, నానార్థైః=అనేకార్థములయినపదములచేతను, అవ్యయైరపి=అవ్యయపదములచేతను, లిఙ్గాదిసఙ్గ్రహైః=లింగసంగ్రహనామసంగ్రహములచేతను, వర్గాః=విశేష్యనిఘ్నసంకీర్ణనానార్థ అవ్యయ లింగాదిసంగ్రహము లనునైదువర్గములు, ఉచ్యన్తే= చెప్పఁబడుచున్నవి. తే=ఆవర్గములు, వర్గసంశ్రయాః = ప్రథమద్వితీయకాండవర్గములనే యాశ్రయించినవి. తఱుచుగాఁ దమలో నవాంతర వర్గములు గలవి యనిగాని యర్థము.

అది యెట్లనఁగా:విశేష్యనిఘ్నవర్గమందుఁ జెప్పఁగలసుకృత్యాదులు స్వర్గాదివిశేషణములును సంకీర్ణవర్గమందుఁ జెప్పఁగల కర్మాదులును వానివ్యాపారములును ఇట్లు కడమవర్గమందుఁ జెప్పఁగల పదార్థముల కును వానితోసంబంధము దెలియవచ్చును కావున నీకాండము సామాన్యకాండ మనిపించుకొనును. రెండవపక్షము—నానార్థవర్గమందు కాం

తాదివర్గములును అవ్యయవర్గమం దవ్యయవర్గావ్యయ నానార్థపద్యము
లును నిట్లే లింగాదిసంగ్రహవర్గమందు నున్నవని తెలియవలయును.

ఈశాస్త్రమున "ప్రాయశో రూపభేదేన" అను సంకేతముచే
తఱచుగా రూపభేదముచేత లింగమెఱుఁగఁదగినది గనుక నీవిశేష్య
ఘ్నవర్గమందు నట్టిసంకేతము లేమినిఁ జెప్పుచున్నాఁడు—

మూ. స్త్రీదారాద్యైర్యద్విశేష్యం యాదృశైః ప్రస్తుతం పదైః,
209 గుణద్రవ్యక్రియాశబ్దా స్తథాస్యు స్తస్య భేదకాః.

టీక. యద్విశేష్యమ్=ఏవిశేష్యమయిన యర్థము. యాదృశైః=
ఏలింగాదులుగల, స్త్రీదారాద్యైఃపదైః=స్త్రీదారమొదలయిన స్త్రీలిం
పుంలింగనపుంసకలింగపదములచేతను, ప్రస్తుతమ్ = ప్రక్రమింపఁబడు
నో, తస్య=ఆవిశేష్యమునకు, భేదకాః=విశేషణములయిన, గుణద్రవ్య
క్రియాశబ్దాః = గుణద్రవ్యక్రియావాచకశబ్దములు, తథాస్యుః =
విశేష్యలింగాదులుగలవే యౌను.

అనఁగా:విశేష్యము ఏలింగమై ప్రక్రమింపఁబడునో గుణద్రవ్య
క్రియావాచకములయిన సుకృత్యాదివిశేషణములును ఆలింగములు
వేయౌనని తాత్పర్యము. ప్రవీణా స్త్రీ- ప్రవీణాః దారాః- ప్రవీణం కళత్రమ్
అని గుణవాచకవిశేషణములకును, ధనినీ స్త్రీ-ధనినో దారాః ధనికళ
త్రమ్ అని ద్రవ్యవాచకవిశేషణములకును, క్షేమంకరా స్త్రీ-క్షేమంక
రాదారాః-క్షేమంకరం కళత్రమ్ అని క్రియావాచకవిశేషణములకు
నుదాహరణములు.

[క్షేమంకరోఽరిష్టతాతి శ్శివతాతి శ్శివంకరః]

[క్షేమంకరః-అరిష్టతాతి - శివతాతిః-శివంక
రః॥ర-శుభమును జేయువానిపేళ్ళు.] ఈయ
కము ప్రక్షిప్తమనికొందఱు. Propitious

సుకృతీ పుణ్యవా న్ధన్యో

సుకృతీ॥న్॥ -పుణ్యవాన్॥త్॥-ధన్యః॥ పుణ్య
ణ్యముగలవానిపేళ్లు. Fortunate

మహేచ్ఛస్తు మహాశయః 3

మహేచ్ఛః-మహాశయః॥౨-ఘనమైన మన
స్సుగలవానిపేళ్లు.విరివియైనమనస్సుగలవాని

హృదయాళు స్సుహృ

హృదయాళుః-సుహృదయః॥ ౨-మంచి

దయో
మహోత్సాహో మ
హోద్యమః,
ప్రవీణే నిపుణాభిజ్ఞ వి
జ్ఞ నిష్ణాత శిక్షితాః. ౮.
వైజ్ఞానికః కృతముఖః
కృతీ కుశల (ఇత్య) పి,
పూజ్యః ప్రతీక్ష్య
స్సాంశయిక స్సంశ
యాపన్నమానసః. ౯
దక్షిణీయో దక్షిణా
ర్హ(స్తత్ర)దాక్షిణ్య (ఇ
త్యపి),
(న్యూ)ర్వదాన్య స్థూల
లక్ష దానశౌణ్డా బహు
ప్రదే, ౬
జైవాతృక (స్సాన్య)
దాయుష్మా
న న్తర్వాణి స్తు శాస్త్ర
విత్.

పరీక్షకః కారణికో
వరదస్తు సమర్ధకః. ౭
హర్షమాణో వికుర్వా
ణః ప్రమనా హృష్ట
మానసః,
దుర్మనా విమనా అ
న్తర్మనా (స్స్యా)

స్సుగలవానిపేళ్ళు. Good-hearted.

మహోత్సాహః-మహోద్యమః॥ ౨-దుష్కర ప్రయోజనములయందుద్యోగముగలవానిపేళ్లు.

ప్రవీణః-నిపుణః-అభిజ్ఞః - విజ్ఞః-నిష్ణాతః-శిక్షితః-వైజ్ఞానికః-కృతముఖః-కృతీ ॥న్॥-కుశలః॥ ౧౦-నేర్పరిపేళ్ళు. Clever.

పూజ్యః-ప్రతీక్ష్యః॥ ౨-పూజ్యునిపేళ్ళు.

సాంశయికః-సంశయాపన్నమానసః॥ ౨-సందేహించువానిపేళ్ళు. సంశయించినవస్తువుపేళ్లని కొందఱందురు. Dubious.

దక్షిణీయః-దక్షిణార్హః-దాక్షిణ్యః ॥౩-దక్షిణకు యోగ్యమయినవానిపేళ్ళు.

వదాన్యః-స్థూలలక్షః-దానశౌణ్డః-బహుప్రదః॥ ౪-మిక్కిలి యిచ్చువానిపేళ్లు. Munificent.

జైవాతృకః-ఆయుష్మాన్ ॥త్॥ ౨-దీర్ఘాయుష్మంతుని పేళ్ళు.

అన్తర్వాణిః-శాస్త్రవిత్ ॥ద్॥ ౨ - శాస్త్రము నెఱింగినవానిపేళ్లు.

[పరీక్ష చేయువానిపేళ్లు.

పరీక్షకః - కారణికః॥ ౨-దానాదులయందు

వరదః-సమర్ధకః॥ ౨-అడిగినవస్తువుల నిచ్చు దేవతాదులపేళ్లు.

హర్షమాణః - వికుర్వాణః-ప్రమనాః ॥స్॥ హృష్టమానసః॥ ౪-సంతోషముతోఁగూడిన మనస్సుగలవానిపేళ్ళు. Joyful.

దుర్మనాః॥స్॥-విమనాః॥స్॥-అన్తర్మనాః॥స్॥ ౩-దుఃఖముతోఁగూడిన మనస్సుగలవానిపేళ్లు.

దుత్క ఉన్మనాః. ౮
దక్షిణే సరళోదారౌ
౦౪౧ సుకలో(దాతృభోక్తరి).
తత్పరే ప్రసితాఽస
క్తా
(విష్టార్థోద్యుక్త) ఉ
త్సుకః. ౯
ప్రతీతే ప్రథిత ఖ్యాత
౦౪౨ విత్త విజ్ఞాత విశ్రుతాః,
(గుణైః ప్రతీతేతు)
కృతలక్ష ణాహతలక్ష
ణౌ. ౧౦

ఉత్కః-ఉన్మనాః॥స్॥ ౨-ప్రియమయినవస్తు వెప్పుడు దొరకునోయని త్వరగలవానిపేళ్లు.

దక్షిణః-సరళః-ఉదారః ॥3-కుటిలము గాక చక్కనైనమనస్సుగలవానిపేళ్లు [గలవానిపేరు.

సుకలః॥౧-దాతృభోక్తరి= త్యాగభోగములు

తత్పరః - ప్రసితః - ఆసక్తః3 - ఒకపదార్థము నందుఁ దగిలిన మనసుగలవానిపేళ్ళు.

ఉత్సుకః॥౧-ఇష్టార్థోద్యుక్తః = ఇష్టమైనప్రయోజనమునం దుద్యోగముగలవానిపేరు.

ప్రతీతః- ప్రథితః-ఖ్యాతః-విత్తః-విజ్ఞాతః-విశ్రుతః॥౬-ధనాదులచేఁ బ్రసిద్ధుండయినవానిపేళ్లు.

కృతలక్షణః-ఆహతలక్షణః॥ ౨-గుణైః=త్యాగశౌర్యాదిగుణములచేత, ప్రతీతే=ప్రసిద్ధుడయినవానిపేళ్ళు.

ఇభ్య ఆఢ్యో ధనీ
స్వామీ త్వీశ్వరః పతి
౪౩ రీశితా, అధిభూ ర్నాయ
కో నేతా ప్రభుః పరివృ
ఢోఽధిపః. ౧౧
అధికర్ధి (స్స)మృద్ధస్స్యా)
(త్కుటుమ్బ వ్యాపృత
౪౪ స్తుయః), స్యా దభ్యాగా
రిక (స్తస్మి) న్నుపాధి(శ్చ
పుమానయమ్), ౧౨
(వరాఙ్గరూపోపేతో
య) స్సింహసంహననో
౪౫ (హి సః),
నిర్వార్యః (కార్యకర్తా
య స్సమ్పన్నస్సత్త్వ

ఇభ్యః-ఆఢ్యః-ధనీ॥న్॥3-ధనికునిపేళ్లు.

స్వామీ॥న్ ॥-ఈశ్వరః-పతిః॥ ఈశితా॥ఋ॥-అధిభూః-నాయకః-నేతా॥ ఋ॥-ప్రభుః - పరివృఢః-అధిపః॥౧౦ ఏలువానిపేళ్ళు. Master

అధికర్ధిః-సమృద్ధః [పా] సమృద్ధిః॥౨-అధిక సంపదగలవానిపేళ్లు.

యః=ఎవఁడు, కుటుమ్బవ్యాపృతః=కుటుంబపోషణమునందాసక్తుఁడైచున్నాఁడో, తస్మిన్=వానియందు, అభ్యాగారికః-ఉపాధిః ॥౨-వర్తించును, ఈఉపాధిశబ్దము నియతపుల్లింగము.

సింహసంహననః॥ ౧-వరాఙ్గరూపోపేతః= శ్రేష్ఠమయిన యంగముతోను రూపముతోను కూడుకొన్నవానిపేరు. Handsome

నిర్వార్యః॥ ౧-సత్త్వసమ్పదా=ఆపత్సంపదలయందు [illegible] ధైర్యసంపదతో,

సమ్పదా). ౧౩

(అవాచి) మూకో౽థ మనోజవః స (పితృ సన్నిభః),

(సత్కృ త్యాలంకృ తాం కన్యాం యో ద దాతి స) కూకుదః. ౧౪

లక్ష్మీవాన్ లక్ష్మణః శ్రీలః శ్రీమాన్

స్నిగ్ధ స్తు వత్సలః,

(స్యా) ద్దయాళుః కా రుణికః కృపాళు స్సుర త (స్సమాః). ౧౫

స్వతన్త్రో౽పావృత స్స్వైరీ స్వచ్ఛన్దో నిర వగ్రహః,

పరత న్త్రః పరాధీనః పరవా న్నాథవా నపి. ౧౬. అధీనో నిఘ్న ఆ యత్తో౽స్వచ్ఛన్దో గృ హ్యకో౽ (ప్యసౌ),

ఖలపూ (స్స్యా) ద్బ హుకరో

దీర్ఘసూత్ర శ్చిరక్రియః. జాల్మో౽సమీక్ష్యకా రీ (స్యా)

త్కుణ్ఠో (మన్దః క్రి

---

న్నః=కూడుకొన్నవాఁడై, యః = ఎవఁడు, కార్యకర్తా=కార్యమును జేయునో, సః=వానిపేరు.

మూకః॥౧-అవాచి=మూఁగవానిపేరు.

మనోజవః[ప]మనోజవసః (పా) మనోజవాః ॥స్॥౧-పితృసన్నిభః=తండ్రినిపోలినవానిపేరు.

కూకుదః॥ ౧-యః = ఎవఁడు, సత్కృత్య=సత్కరించి, అలంకృతామ్ = అలంకరింపఁబడిన, కన్యామ్=కన్యకను, దదాతి = దానముచేయుచున్నాఁడో, సః=వానిపేరు.

లక్ష్మీవాన్ ॥త్॥-లక్ష్మణః-శ్రీలః-శ్రీమాన్॥త్॥ ౪-సంపదగలవానికిని ఒప్పిదముగలవానికిని పేళ్లు.

స్నిగ్ధః-వత్సలః॥౨-స్నేహముగలవానిపేళ్ళు.

దయాళుః - కారుణికః - కృపాళుః - సురతః॥ ౪-దయగలవానిపేళ్ళు. Kind.

స్వతన్త్రః-అపావృతః- స్వైరీ॥న్॥ - స్వచ్ఛన్దః-నిరవగ్రహః॥౫-స్వతంత్రునిపేళ్ళు.

పరతన్త్రః-పరాధీనః-పరవాన్ ॥త్॥ - నాథవాన్॥త్॥-అధీనః - నిఘ్నః-ఆయత్తః- అస్వచ్ఛన్దః-గృహ్యకః॥౯-పరాధీనునిపేళ్ళు. Dependent.

ఖలపూః-బహుకరః॥ ౨-కళ్లము నూడుచువానిపేళ్ళు.

దీర్ఘసూత్రః-చిరక్రియః ॥౨-విచారించి మెల్లగా [కార్యముఁ జేయువానిపేళ్ళు.

జాల్మః-అసమీక్ష్యకారీ॥న్॥౨ - విచారింపక కార్యముఁ జేయువానిపేళ్ళు.

కుణ్ఠః॥ ౧- క్రియాసు = కార్యములయందు,

(యాసు యః),
కర్మక్షమో ఽలంకర్మీణః
క్రియావాన్ (కర్మసూద్యతః). ౧౮
స కార్మః కర్మశీలో (యః)
కర్మశూర స్తు కర్మఠః,

యః=ఎవఁడు, మన్దః=అలసుఁడో వానిపేరు.

కర్మక్షమః-అలంకర్మీణః॥౨-అనాయాసముగ కార్యమును జేయువానిపేళ్లు. కార్యసమర్థుఁడు.

క్రియావాన్ ॥త్॥ ౧- కర్మసు ఉద్యతః= కార్యమును జేయ నుద్యోగించిన వానిపేరు.

కార్మః-కర్మశీలః॥౨-ఫలముగలిగినను లేకున్నను కార్యముఁ జేయు స్వభావముగల వానిపేళ్లు.

కర్మశూరః-కర్మఠః॥౨-ఫలము గలుగునా కును కార్యముఁ జేయు తెగువగలవానిపేళ్లు.

కర్మణ్యభు (క్కర్మకరః)
కర్మకార (స్తు తత్క్రియః). ౧౯
అపస్నాతో మృతస్నాత

కర్మణ్యభుక్॥౧-కర్మకరః= కూలిపుచ్చుకొని పనిచేయు వానిపేళ్లు.

కర్మకారః॥ ౧-తత్క్రియః = కూలిలేక పని చేయువానిపేరు.

అపస్నాతః - మృతస్నాతః॥ ౨ - బంధుహృదాదిమరణనిమిత్తమయి స్నానము చేసిన వానిపేళ్లు. సంస్కారార్థమయిస్నానముచేయింపఁబడిన శవముపేళ్లనికొందఱు.

ఆమిషాశీతు శౌష్కలః,
బుభుక్షిత (స్స్యా)త్క్షుధితో జిఘత్సు రశనాయితః. ౨౦
పరాన్నః పరపిణ్డాదో

ఆమిషాశీ॥న్॥శౌష్కలః [పా] శౌష్కలి ౨-మాంసముదినువానిపేళ్లు.

బుభుక్షితః-క్షుధితః-జిఘత్సుః - అశనాయితః॥౪-ఆఁకలిగొన్నవానిపేళ్లు. Hungry

పరాన్నః-పరపిణ్డాదః॥౨- పరాన్నమే భుజించువానిపేళ్లు.

భక్షకో ఘస్మరో ఽద్మరః,
ఆద్యూన(స్స్యా) దౌదరికో (విజిగీషావివర్జితే).
(ఉభా) వాత్మమ్భరిః కుక్షిమ్భరి (స్స్వోదర

భక్షకః-ఘస్మరః-అద్మరః॥3-తిండిపోతుపేళ్లు.

ఆద్యూనః-ఔదరికః॥ ౨-విజిగీషావివర్జితుఁడై యుద్యోగము లేక పొట్టపోసికొనువానిపేళ్లు.

ఆత్మమ్భరిః-కుక్షిమ్భరిః॥ ఈ౨-నఁబోష్య... = తనకడుపు...

పూరకే),
సర్వాన్నీనస్తు సర్వా
న్నభోజీ
గృధ్నుస్తు గర్ధనః.
లుబ్ధోఽభిలాషుక స్తృ
ష్ణక్ (సమౌ) లోలుప
లోలుభౌ,
సోన్మాద స్తూన్మదిష్ణు
(స్స్యా)
దవినీత స్సముద్ధతః.
మత్తే శౌణ్డోత్కట
క్షీబాః

కాముకే కమితాఽ
నుకః, కమ్రః కామయి
తాఽభీకః కమనః కా
మనోఽభికః. ౨౮
విధేయో వినయగ్రాహీ
వచనే స్థిత ఆశ్రవః,
వశ్యః ప్రణేయో

నిభృత వినీత ప్రశ్రి
తా (స్సమా.) ౨౯
ధృష్టే ధృష్ణు ర్వియాత
శ్చ ప్రగల్భః ప్రతిభా
న్వితే,
(స్యా) దధృష్టే తుశా
లీనో

నిండించుకొనువాని పేళ్ళు.

సర్వాన్నీనః-సర్వాన్నభోజీ॥న్॥ ౨-నియమములేక యన్నితావుల భుజించువాని పేళ్ళు.

గృధ్నుః-గర్ధనః-లుబ్ధః - అభిలాషుకః - తృష్ణక్ ॥జ్॥౫-ఆశగలవాని పేళ్ళు. Greedy.

లోలుపః-లోలుభః॥ ౨-మిక్కిలియు నాశగలవాని పేళ్ళు. Very greedy.

సోన్మాదః-ఉన్మదిష్ణుః॥ ౨-భూతావేశాదులచేత నొడలెఱుఁగనివాని పేళ్ళు.

అవినీతః-సముద్ధతః॥ ౨-వినయములేనివాని [పేళ్ళు.

మత్తః-శౌణ్డః - ఉత్కటః-క్షీబః॥ ౪-మద్యపానాదులచేత నొడలెఱుఁగనివాని పేళ్ళు.

కాముకః - కమితా॥ఋ॥-అనుకః - కమ్రః-కామయితా॥ఋ॥-అభీకః - కమనః - కామనః - అభికః॥౯-కాముకుని పేళ్ళు. కోరికగలవాఁడు. Lustful.

విధేయః-వినయగ్రాహీ॥న్॥ ౨-వినయము [గలవాని పేళ్ళు.

వచనేస్థితః-ఆశ్రవః॥౨-చెప్పినట్టు చేయువాని పేళ్ళు. ఇవియు వినయముగలవాని పేళ్లందురు.

వశ్యః-ప్రణేయః॥ ౨-ఔషధాదులచేతవశ్యమయినవాని పేళ్లు. ఇవియు వినయముగలవాని పేళ్లనికొందఱు.

నిభృతః-వినీతః-ప్రశ్రితః [పా] ప్రసృతః॥ 3. శిక్షింపఁబడినవాని పేళ్ళు.

ధృష్టః-ధృష్ణుః-వియాతః॥ 3-దిట్టతనముగ [లవాని పేళ్ళు.

ప్రగల్భః-ప్రతిభాన్వితః॥ ౨-అప్పటప్పటికిక్రొత్తగాప్రకాశించు ప్రజ్ఞగలవాని పేళ్లు.

అధృష్టః-శాలీనః॥ ౨-దిట్టగానివాని పేళ్లు.

విలక్షో విస్మయా న్వి తే. ౨౯

అధీ రే కాతర

త్రస్నో భీరు భీరుక

౦౨౨ భీలుకాః,

ఆశంసు రాశంసితరి

గ్రహయాళు ర్గ్రహీ తరి. ౨౮

శ్రద్ధాళుః (శ్రద్ధయా యుక్తే)

౦౨౧ పతయాళుస్తు పాతుకే,

లజ్జాశీలేஉపత్రపిష్ణు

ర్వన్దారు రభివాదకే.

శరారు ర్ఘాతుకో హింస్రః

౦౨౧ (స్నా) ద్వర్ధిష్ణుస్తు వర్ధనః,

ఉత్పతిష్ణు స్తూత్పతితా

ఉలంకరిష్ణు స్తు మణ్డనః.

భూష్ణు ర్భవిష్ణు ర్భవితా

వర్తిష్ణో ర్వర్తన (స్స

౨౩ మా),

నిరాకరిష్ణుః క్షిప్నుః (స్యాత్)

(సాన్ద్రి) స్నిగ్ధ స్తు

విలక్షః-విస్మయాన్వితః॥ ౨-ఆశ్చర్యముచే ప్రక్ష

తార్థజ్ఞానములేనివానిపేళ్లు. వెఱఁగుపడినవాఁడు.

అధీరః-కాతరః॥౨-వ్యసనాదులచేతవ్యాకుల

పడినవానిపేళ్లు. Confused

త్రస్నుః-భీరుః-భీరుకః-భీలుకః॥ ౪ - వెఱచు

స్వభావముగలవానిపేళ్లు. [కోరువానిపేళ్లు.

ఆశంసుః-ఆశంసితా ॥ఋ॥ ౨-ప్రియవస్తు

గ్రహయాళుః-గ్రహీతా ॥ఋ॥ ౨-పుచ్చు

కొనుస్వభావముగలవానిపేళ్ళు.

శ్రద్ధాళుః॥ ౧-శ్రద్ధయా=నమ్మికతో, యుక్తే

=కూడియున్న వానిపేరు. [గలవానిపేళ్లు.

పతయాళుః-పాతుకః॥ ౨-పడుస్వభావము

లజ్జాశీలః - అపత్రపిష్ణుః॥ ౨- సిగ్గుపడుస్వ

భావముగలవానిపేళ్లు. [భావముగలవానిపేళ్లు.

వన్దారుః - అభివాదకః ౨- మ్రొక్కుస్వ

శరారుః-ఘాతుకః-హింస్రః॥ 3-చంపుస్వభా

వముగలవానిపేళ్లు. [గలవానిపేళ్లు.

వర్ధిష్ణుః-వర్ధనః॥ ౨-వృద్ధిఁబొందుస్వభావము

ఉత్పతిష్ణుః-ఉత్పతితా॥ఋ॥ ౨ - ఎగయుస్వ

భావముగలవానిపేళ్ళు. [భావముగలవానిపేళ్లు.

అలంకరిష్ణుః-మణ్డనః॥ ౨-శృంగారించు స్వ

భూష్ణుః-భవిష్ణుః-భవితా॥ఋ॥ 3 - కా

లవానిపేళ్లు. పలుమాఱును మొలుచుస్వభా

ముగల కేశనఖాదులపేళ్లని కొందఱు.

వర్తిష్ణుః-వర్తనః॥ ౨ - వర్తించుస్వభావము

గలవానిపేళ్లు, కాలాదులపేళ్లని కొందఱు.

నిరాకరిష్ణుః-క్షిప్నుః॥౨-తిరస్కరించుస్వభా

వముగలవానిపేళ్లు.

మేదురః॥ ౧-సాన్ద్రః = దట్టమయి, స్నిగ్ధ

మేదురః. 30

నిగ్గుగలిగిన మేఘపటలాదుల పేరు.

జ్ఞాతా తు విదురో విన్దు

జ్ఞాతా॥ఋ॥-విదురః-విన్దుః॥3 - ఎఱుఁగు స్వభావము గలవాని పేళ్ళు. [ము గలదాని పేళ్లు.

ర్వికాసీ తు వికస్వరః

వికాసీ॥న్॥-వికస్వరః ॥౨- వికసించుస్వభావ

విసృత్వరో విసృమరః ప్రసారీ చ విసారిణః.

విసృత్వరః-విసృమరః-ప్రసారీ ॥న్॥ - విసారీ ॥న్॥౪-నెఱయుస్వభావముగల నీళ్లమీఁది తైల బిందువులు మొదలయినవాని పేళ్లు.

సహిష్ణు స్సహనః క్షన్తా తితిక్షుః క్షమితా క్షమీ,

సహిష్ణు॥-సహనః-క్షన్తా॥ఋ॥-తితిక్షుః - క్షమితా॥ఋ॥-క్షమీ॥న్॥౬ - స్వభావముచేత నోర్పుగలవాని పేళ్ళు. Content

క్రోధనో ఽమర్షణః కోపీ

క్రోధనః-అమర్షణః -కోపీ ॥న్॥3-స్వభావముచేత కోపముగలవాని పేళ్లు. Wrathful

చణ్డ స్త్వత్యన్తకోపనః. 3౨

చణ్డః-అత్యన్తకోపనః॥౨-మిక్కిలి కోపించు కొనువాని పేళ్లు. [యుండువాని పేళ్ళు.

జాగరూకో జాగరితా

జాగరూకః - జాగరితా ॥ఋ॥ ౨-మేల్కొని

ఘూర్ణితః ప్రచలాయితః,

ఘూర్ణితః-ప్రచలాయితః॥ ౨-కూరుకుపాటు పడువాని పేళ్లు. కూర్చుండి నిద్రపోవువాఁడు.

స్వప్నక్ శయాళు ర్నిద్రాళు

స్వప్నక్ ॥జ్॥ - శయాళుః-నిద్రాళుః॥3-నిద్రపోతు పేళ్ళు. తూఁగుపోతు. Sleepy

ర్నిద్రాణ శయితౌ సమౌ. 33

నిద్రాణః-శయితః॥౨- నిద్రపోవువాని పేళ్ళు. Asleep

పరాఙ్ముఖః పరాచీన (స్స్యా)

పరాఙ్ముఖః-పరాచీనః॥ ౨ - ఆవలిముఖ మయినవాని పేళ్లు. పెడమొగముగానున్నవాఁడు.

దవా జ్యప్యధోముఖః,

అవాఙ్ ॥చ్॥-అపిశబ్దముచేత, అవాచీనః - అధోముఖః॥3-తలవంచుకొన్నవాని పేళ్ళు.

(దేవా నఞ్చతి) దేవద్ర్యఙ్

దేవద్ర్యఙ్ ॥చ్॥౧- దేవాన్ అఞ్చతి= దేవతలనుగూర్చి పోవువానికిఁగాని దేవతలను బూజించువానికిఁగాని పేరు.

విశ్వద్ర్యఙ్ (విష్వగ

విష్వద్ర్యఙ్ ॥చ్॥౧-విష్వక్ అఞ్చతి=అంతట

ఞ్చతి). 3౪
(యస్సహాఞ్చతి) స
ధ్య్రఙ్ (స)
(స)తిర్యఙ్ (య_స్తిరో
ఽఞ్చతి(,
వదో వదావదో వక్తా
వాగీశో వాక్పతి (స్స
మా). 3౫
వాచోయుక్తి పటు
ర్వాగ్మీ, వావదూకోఽ
తివక్తరి),
(స్యా)జ్జల్పాక స్తు వా
చాలో వాచాటో బ
హుగర్హ్యవాక్. 3౬

నడచువాని పేరు.
సధ్య్రఙ్॥చ్॥౧-సహ అఞ్చతి = ఒకరితోఁ గూడ
బోవువాని పేరు.
తిర్యఙ్॥చ్॥౧-తిరః అఞ్చతి=అడ్డముగా నడ
చువాని పేరు. [వాని పేళ్లు
వదః-వదావదః- వక్తా॥ఋ॥ 3- పలుకనేర్చి
వాగీశః-వాక్పతిః॥ ౨-నిర్దోషముగాఁ బలుక
నేర్చినవాని పేళ్ళు. Eloquent
వాచోయుక్తిపటుః - వాగ్మీ ॥న్॥ వావదూ
కః॥3-తానుపలుక నిశ్చయించిన యర్థమును
లెస్సగా నిర్వహించి పలుకువాని పేళ్లు.
జల్పాకః-వాచాలః-వాచాటః- బహుగర్హ్య
వాక్॥చ్॥ ౪-దోషయుక్తముగా పెక్కుమాట
లాడువాని పేళ్ళు.

దుర్ముఖే ముఖ రాబద్ధ
ముఖౌ
శ్లక్ష్ణః ప్రియంవదే,
లోహల స్స్యా దస్ఫు
టవాక్
గర్హ్యవాదీతు కద్వ
దః. 3౭
(సమౌ) కువాద కుచ
రౌ
(స్యా దసౌమ్యస్వరో)
ఽస్వరః,
రవణ శ్శబ్దనో
నాన్దీవాదీ నాన్దీకర (స్స
మౌ). 3౮

దుర్ముఖః ముఖరః-అబద్ధముఖః॥3- అప్రియ
ముగాఁ బలుకువాని పేళ్లు[గాఁ బలుకువాని పేళ్లు
శ్లక్ష్ణః[పా]శక్ణః - ప్రియంవదః॥౨-ప్రియము
లోహలః-అస్ఫుటవాక్॥చ్॥౨-వ్యక్తము
కుండ మాటలాడువాని పేళ్ళు. Lisping
గర్హ్యవాదీ॥న్॥-కద్వదః॥ ౨-నిందింపఁదగిన మా
టలాడువాని పేళ్లు,కొఱగానిమాటలాడువాని
కువాదః (పా) కుపాదః-కుచరః॥౨- మరు
దోషమును బలుకువాని పేళ్ళు.
అస్వరః॥౧-అసౌమ్యస్వరః=చెవులకు నిష్టము
గాని స్వరముగలవాని పేరు. [వాని పేళ్లు
రవణః-శబ్దనః॥౨-మోఁగియుస్వభావము
నాన్దీవాదీ॥న్॥ నాన్దీకరః॥ ౨ -ఆశీర్వాదము
తోఁగూడిన దేవతాదులయొక్క స్తోత్రముగా
యు మంగళ పాఠకుని పేళ్ళు.

జడోఽజ్ఞే

జడః-అజ్ఞః॥ ౨-ఇష్టానిష్టసుఖదుఃఖముల నెఱుఁగక పరవశుఁడై యూరకయున్నవానిపేళ్లు.

అనేడమూక(స్తు వక్తుం శ్రోతు మశిక్షితే),

అనేడమూకః ॥౧-వక్తుమ్ = పలుకుటకును, శ్రోతుమ్=వినుటకును, అశిక్షితే = శిక్షింపఁబడని వానిపేరు. అనఁగా చెవిటివానికిని మూఁగవానికిని సరియైనవాఁడు. ఏడమూకయనుపాఠ మంగీకరించి చెవుడును మూఁగతనమును గలవానికి పేరని కొందఱు. ౧౧౦౦

తూష్ణీం శీల స్తు తూష్ణీకో

తూష్ణీంశీలః-తూష్ణీకః॥ ౨-మాటలాడకయూరకుండు స్వభావముకలవానిపేళ్ళు. Silent.

నగ్నో ఽవాసా దిగమ్బరః. ౩-

నగ్నః-అవాసాః॥స్॥ -దిగమ్బరః॥౩- దిసమొలవానిపేళ్ళు. Naked.

నిష్కాసితో ఽవకృష్ట స్స్యా

నిష్కాసితః-అవకృష్టః॥ ౨ - వెళ్లఁగొట్టఁబడినవానిపేళ్ళు.

దపధ్వ స్త స్తు ధిక్కృతః,

అపధ్వస్తః-ధిక్కృతః॥ ౨-తిరస్కరింపఁబడినవానిపేళ్ళు.

ఆత్తగన్ధో ఽభిభూత (స్స్యా)

ఆత్తగన్ధః [పా] ఆత్తగర్వః-అభిభూతః॥ ౨- ౧౧౦౧ రాజుచేతఁగాని శత్రువుచేఁగాని పోఁగొట్టఁబడిన గర్వము గలవానిపేళ్ళు.

ద్దాపిత స్సాధిత(స్సమౌ).

దాపితః-సాధితః॥ ౨ రాజుచేతదండుగగొనఁబడినవానిపేళ్ళు.

ప్రత్యాదిష్టో నిర స్త (స్స్యా) త్ప్రత్యాఖ్యాతో నిరాకృతః,

ప్రత్యాదిష్టః-నిరస్తః - ప్రత్యాఖ్యాతః-నిరాకృతః॥ ౪-న్యాయముచేత పరిహరింపఁబడినవానిపేళ్ళు. Removed. ౧౧౦౨

నికృత (స్స్యా) ద్విప్రకృతో

నికృతః-విప్రకృతః॥ ౨ - పీడింపఁబడినవానిపేళ్లు. Insulted.

విప్రలబ్ధస్తు వఞ్చితః.

విప్రలబ్ధః-వఞ్చితః॥ ౨ - మోసపుచ్చఁబడినవానిపేళ్ళు.

మనోహతః ప్రతిహతః ప్రతిబద్ధో హత శ్చసః,

మనోహతః-ప్రతిహతః-ప్రతిబద్ధః-హతః॥౪- మనస్సున నుత్సాహము చెడినవానిపేళ్లు. [పేళ్లు. ౧౧౦౩

అధిక్షిప్తః ప్రతిక్షిప్తే

అధిక్షిప్తః- ప్రతిక్షిప్తః॥ ౨-ఆక్షేపింపఁబడినవాని

బద్ధే కీలిత సంయతౌ

బద్ధః- కీలితః-సంయతః ౩ - ...

| | |
|---|---|
| ४२ | మొదలయినవానిచేత కట్టఁబడినవానిపేళ్ళు. |
| ఆపన్న ఆపత్ప్రాప్త (స్స్యాత్) | ఆపన్నః-ఆపత్ప్రాప్తః॥౨ - ఆపదఁబొందినవానిపేళ్ళు. |
| కాన్దిశీకో భయద్రుతః, | కాన్దిశీకః - భయద్రుతః॥౨-వెఱచి పాఱిపోవు [వానిపేళ్లు. |
| ఆక్షారితః క్షారితో౽భిశస్తే | ఆక్షారితః-క్షారితః-అభిశస్తః॥3 - పరస్త్రీగమన బ్రహ్మహత్యాదులవలననిందింపఁబడినవానిపేళ్లు. |
| సంకసుకో౽స్థిరే. ४3 | సంకసుకః -అస్థిరః॥౨- దేనియందును నిలుకడ లేనివానిపేళ్ళు. Unsteady. |
| వ్యసనార్తో పరక్తౌ ద్వౌ | వ్యసనార్తః-ఉపరక్తః॥౨ - దైవకృతమనుష్య కృతములయిన శరీరపీడగలవానిపేళ్ళు.జూదము మొదలైనవ్యసనములుగలవానిపేళ్లనికొందఱు. |
| విహస్తవ్యాకులౌ (స ౧౧మౌ), | విహస్తః-వ్యాకులః॥ ౨-శోకాదులచేతవేఁ కముం దెలిఁగనివానిపేళ్ళు. Perplexed. |
| విక్లబో విహ్వలః | విక్లబః-విహ్వలః॥౨ - భయాదులచేతఁ దన యవయవములనుధరింప శక్తిలేనివానిపేళ్ళు. |
| (స్యాత్తు) వివశో౽(రిష్టదుష్టధీః). ४४ | వివశః॥౧- అరిష్టదుష్టధీః = ఆసన్నమరణము చేత దూషితమైన బుద్ధిగలవానిపేరు. |
| కశ్యః కశార్హే | కశ్యః-కశార్హః॥౨-అపరాధమువలనచబుకు పెట్లకుఁ దగినవానిపేళ్ళు. |
| సన్నద్ధే త్వాతతా ౧౩ యీ (వధోద్యతే), | ఆతతాయీ॥న్ ॥౧ - వధోద్యతే=చంపు యత్నముఁగల, సన్నద్ధే=సన్నద్ధునిపేరు. [పేళ్లు |
| ద్వేష్యే త్వక్షిగతో | ద్వేష్యః-అక్షిగతః॥ ౨- ద్వేషింపఁదగినవా |
| వధ్య శ్శీర్షచ్ఛేద్య (ఇమౌ సమౌ). ४५ | వధ్యః - శీర్షచ్ఛేద్యః॥ ౨ - చంపఁదగినవా పేళ్లు. |
| విష్యో (విషేణ యో వధ్యో) | విష్యః॥౧- విషేణ=విషముచేత, యః=ఎవ్వఁడు, వధ్యః=చంపఁదగినవాఁడో వానిపేరు. |
| ముసల్యో (ముసలేన ౧४ యః), | ముసల్యః॥౧- ముసలేన=రోఁకటిచేతఁ జంప దగినవానిపేరు. |
| శివ్విదాణో౽కృష్ణ | శివ్విదాణః-అకృష్ణకర్మా॥౨-మంచియో |

కర్తా

రముగలవానిపేళ్లు. కొందలు, శిశ్వదాసః-కృష్ణకర్తా॥ ౨-దురాచారముగలవానిపేళ్ల నిరి.

చపల శ్చికురః(స్సమౌ). ౪౭

చపలః-చికురః॥ ౨ - దోషము విచారింపక వధబంధనాదులను జేయువానిపేళ్ళు.

దోషైకదృ క్పురోభాగీ

దోషైకదృక్॥శ్॥-పురోభాగీ॥న్॥ ౨-దోషము నే వెదకువానిపేళ్ళు.

నికృత స్త్వనృజు శ్శఠః,

నికృతః-అనృజః-శఠః॥3-కుత్సితుని పేళ్ళు.

కర్ణేజప స్సూచకః (స్స్యా) త్పిశునో

కర్ణేజపః-సూచకః-పిశునః॥ 3 - కొండెముఁ జెప్పువానిపేళ్ళు. Informer.

దుర్జనః ఖలః. ౪౮

దుర్జనః-ఖలః॥ ౨-దుష్టాత్ముని పేళ్ళు.

నృశంసో ఘాతుకః క్రూరః పాపో

నృశంసః-ఘాతుకః-క్రూరః-పాపః॥ ౪-పరులకు బాధచేయు స్వభావముగలవానిపేళ్ళు.

ధూర్త స్తు వఞ్చకః,

ధూర్తః-వఞ్చకః॥౨-మోసపుచ్చువానిపేళ్లు.

అజ్ఞే మూఢ యథాజాత మూర్ఖ వైధేయ బాలిశాః. ౪౯

అజ్ఞః-మూఢః-యథాజాతః-మూర్ఖః-వైధేయః-బాలిశః॥౬-ఎఱుక లేనివానిపేళ్ళు. Idiot.

కదర్యే కృపణ క్షుద్ర కింపచాన మితంపచాః,

కదర్యః-కృపణః-క్షుద్రః-కింపచానః-మితంపచః॥౫-లోభివానిపేళ్ళు. Miser.

నిస్వస్తు దుర్విధో దీనో దరిద్రో దుర్గతో ఽపి సః.

నిస్వః-దుర్విధః-దీనః-దరిద్రః - దుర్గతః॥ ౫-దరిద్రుని పేళ్ళు. Poor.

వనీపకో యాచనకో మార్గణో యాచకార్థినా,

వనీపకః-యాచనకః-మార్గణః- యాచకః-అర్థీ॥న్॥౫-అడుగువానిపేళ్ళు. Beggar.

అహంయు (స్స్యా) దహంకారీ

అహంయుః-అహంకారీ॥న్॥ ౨-అహంకారముగలవానిపేళ్ళు. Proud.

శుభంయు స్తు శుభాన్వితః. ౫౦

శుభంయుః-శుభాన్వితః॥ ౨ - శుభముగలవానిపేళ్ళు. Happy.

దివ్యోపపాదుకా (దే వా)

దివ్యోపపాదుకః॥౧- దేవాః=స్వర్గమునందుండు మాతాపితృసంబంధము లేక పుట్టిన దేవతల పేరు

(నృగవాద్యా) జరా
౧౭ యుజాః,
స్వేదజాః (క్రిమి దం
శాద్యాః)
(పక్షిసర్పాదయో) ఽ
ణ్డాజాః. ౫౧
ఉద్భిద (స్తరుగుల్మా
ద్యా)

జరాయుజాః౧-నృగవాద్యాః=మావియందుఁబుట్టిన మనుష్యులుపశువులు మొదలైన వానిపేరు.
స్వేదజః॥౧-క్రిమిదంశాద్యాః=చెమటవలనఁబుట్టినపురుగులు ఈగలు మొదలయిన వానిపేరు.
అణ్డజః॥ ౧-పక్షిసర్పాదయః=గ్రుడ్డువలనఁబుట్టిన పక్షులు పాములు మొదలయినవానిపేరు.
ఉద్భిత్॥ద్॥౧-తరుగుల్మాదాగః = నేలనుక్కలించుకొనిపుట్టువృక్షములు పొదలు కస్సు మొదలయిన వానిపేరు. Vegetables

ఉద్భి దుద్భిజ్జ ముద్భి
౧౭౭ దమ్,
సున్దరం రుచిరం చా
రు సుషమం సాధుశోభ
నమ్. ౫౨. కాన్తం మ
నోహరం రుచ్యం మ
౧౭౮ నోజ్ఞం మఞ్జుమఞ్జులమ్,
(త) దాసేచనకం (తృ
ప్తే ర్నా స్త్యన్తో య
స్య దర్శనాత్). ౫౩

ఉద్భిత్ ॥ద్॥-ఉద్భిజ్జమ్-ఉద్భిదమ్॥3-ఆకుగుల్మాదుల కేపేళ్ళు.
సున్దరమ్-రుచిరమ్-చారు-సుషమం-సాధు-శోభనమ్-కాన్తమ్-మనోహరమ్ (పా) మనోరమమ్-రుచ్యమ్-మనోజ్ఞమ్- మఞ్జు-మఞ్జులమ్॥౧౨-చక్కనివస్తువు పేళ్ళు. Beautiful
ఆసేచనకమ్॥౧-యస్య = ఏవస్తువుయొక్క దర్శనాత్ =చూచుటవలన, తృప్తేః-తనివికి,అన్తః=తుద, నాస్తి=లేదో, తత్ =ఆవస్తువుపేరు.

అభీష్టే ఽభీప్సితం
హృద్యం దయితం వ
౧౭౯ ల్లభం ప్రియమ్,
నికృష్ట ప్రతికృష్టా
ర్వ రేఫ యాప్యావ
మాధమాః. కుపూయ
కుత్సి తావద్య ఖేట గ
౧౮౦ ర్హ్యాణకాస్సమాః,
మలీమసంతు మలినం
కచ్చరం మలదూషితమ్,

అభీష్టమ్-అభీప్సితమ్-హృద్యమ్-దయితమ్-వల్లభమ్-ప్రియమ్॥ ౬-మనస్సునకుఁ బ్రియమైనవస్తువు పేళ్లు. Desired
నికృష్టః-ప్రతికృష్టః-అర్వా॥న్॥-రేఫః (ప)-యాపః॥స్॥-యాప్యః-అవమః-అధమః-కుపూయః-కుత్సితః-అవద్యః- ఖేటః-గర్హ్యః-అణకః॥ ౧౪-జాత్యాచారాదులచేతనిందితుఁడైన వానిపేళ్లు. Low
మలీమసమ్-మలినమ్-కచ్చరమ్- మలదూషితమ్॥ ౪-మాసినవస్తువు పేళ్లు. Dirty

| | |
|---|---|
| పూతం పవిత్రం మేధ్యం చ | పూతమ్-పవిత్రమ్-మేధ్యమ్॥3-పవిత్రమయిన వస్తువు పేళ్ళు. Pure. |
| వీధ్రం (తు విమలార్థకమ్), | వీధ్రమ్॥౧-విమలార్థకమ్=(స్వభావముచేత) నిర్మలమయిన స్ఫటికాది వస్తువులపేరు. |
| నిర్ణిక్తం శోధితం మృష్టం నిశ్శోధ్య మనవస్కరమ్. ౫౬ | నిర్ణిక్తమ్-శోధితమ్- మృష్టమ్-నిశ్శోధ్యమ్-అనవస్కరమ్॥౫-కల్మషము లేనట్టు శోధింపఁబడిన వస్తువు పేళ్లు. [లయినవస్తువుల పేళ్లు. |
| అసారం ఫల్గు | అసారమ్-ఫల్గు॥ ౨-సారము లేనిదూదిమొద |
| శూన్యం తు వశికం తుచ్ఛ రిక్తకే, | శూన్యమ్-వశికమ్-తుచ్ఛమ్ - రిక్తకమ్॥ ౪-రిక్తమైన యిల్లు మొదలయినవాని పేళ్లు. |
| (క్లీబే) ప్రధానం ప్రముఖ ప్రవేకానుత్తమోత్తమాః. ముఖ్య వర్య వరేణ్యాశ్చ ప్రబర్హో౽నపరార్ధ్య (వత్), పరార్ధ్యాగ్ర ప్రాగ్రహర ప్రాగ్ర్యాగ్ర్యాగ్రీయ మగ్రియమ్. శ్రేయాన్ శ్రేష్ఠః పుష్కల (స్స్యాత్) సత్తమ శ్చాతిశోభనః. | ప్రధానమ్॥నిత్యనపుంసకలింగము॥-ప్రముఖః-ప్రవేకః-అనుత్తమః-ఉత్తమః-ముఖ్యః - వర్యః-వరేణ్యః-ప్రబర్హః అనపరార్ధ్యః-పరార్ధ్యమ్-అగ్రమ్-ప్రాగ్రహరమ్ - ప్రాగ్ర్యమ్-అగ్ర్యమ్-అగ్రీయమ్-అగ్రియమ్॥౧౭-ప్రధానవస్తువు పేళ్లు శ్రేయాన్॥స॥-శ్రేష్ఠః-పుష్కలః-సత్తమః - అతిశోభనః॥౫-మిక్కిలి శ్రేష్ఠుని పేళ్లు. ప్రధానశబ్దము మొదలు ౨౨ను శ్రేష్ఠుని పేళ్లనికొందఱు. Superior. |
| (స్యు రుత్తరపదే) వ్యాఘ్ర పుఙ్గవ ర్షభ కుఞ్జరాః. ౫౭. సింహశార్దూల నాగాద్యాః (పుంసి శ్రేష్ఠార్థగోచరాః), | వ్యాఘ్రః-పుఙ్గవః-ఋషభః-కుఞ్జరః-సింహః-శార్దూలః నాగః॥ ఈ౭ను-ఆదిశబ్దము చేతచంద్రాదిశబ్దములును, ఉత్తరపదే = సమాసమునందుత్తరపదములగును, శ్రేష్ఠార్థగోచరాః = పూర్వపదార్థశ్రేష్ఠత్వమును జెప్పును. అపుడు, పుంసిస్యుః=పుంలింగములౌను. |
| అప్రాగ్ర్యం (ద్వయహీనే ద్వే) అప్రధానోపసర్జనే. ౬౦ | అప్రాగ్ర్యమ్-అప్రధానమ్-ఉపసర్జనమ్॥ 3-ప్రధానముకానిదాని పేళ్ళు. అప్రధానోపసర్జనశబ్దములు నియతనపుంసకములు. Secondary. |

విశఙ్కటం పృథు బృహ ద్విశాలం పృథులం మ హత్, వడ్రోరువిపులం

విశఙ్కటమ్-పృథు-బృహత్ ॥ద॥-విశాలమ్-పృథులమ్-మహత్ - వడ్రమ్-ఉరు - విపులమ్ ౯-ఎశము గలదాని పేళ్లు. Copious

పీన పీవ్నీ తు స్థూల పీ వరే. ౬౧

పీనమ్-పీవ ॥న్॥-స్థూలమ్-పీవరమ్॥ ౪-బలిసినదాని పేళ్లు. Fat

స్తోకాల్ప క్షుల్లకా స్సూక్ష్మం శ్లక్ష్ణం దభ్రం కృశం తను,

స్తోకః-అల్పః-క్షుల్లకః-సూక్ష్మమ్ - శ్లక్ష్ణమ్-దభ్రమ్-కృశమ్-తనుః ౮-సన్నవు నూలుపోగు మొదలయినదాని పేళ్ళు. Small

(స్త్రియాం) మాత్రా త్రుటిః (పుంసి) లవ లేశ కణాణవః. ౬౨

మాత్రా-త్రుటిః॥ నియత స్త్రీలింగము-లవః-లేశః-కణః అణుః॥ నియతపుంలింగము ౬-కొంచెమయినదాని పేళ్లు. Minute

అత్యల్పే ఽల్పిష్ఠ మల్పీయః కనీయో ఽణీయ (ఇత్యపి),

అల్పిష్ఠమ్-అల్పీయః॥స॥ కనీయః ॥స॥-అణీయః॥స॥ ౪-అపిశబ్దమువలన, కనిష్ఠమ్-అణిష్ఠమ్ ఈ౨ను మిక్కిలి కొంచమయినదాని పేళ్లు.

ప్రభూతం ప్రచురం ప్రాజ్య మదభ్రం బహుళం బహు. పురుహూః పురు భూయిష్ఠం స్ఫారం భూయశ్చ భూరి చ, ౬౩

ప్రభూతమ్-ప్రచురమ్-ప్రాజ్యమ్-అదభ్రమ్- బహుళమ్-బహు పురుభూః (పా) పురుహూః పురుహమ్-పురు-భూయిష్ఠమ్-స్ఫిరమ్(పా) స్ఫారం-భూయః॥స॥-భూరి॥౧౨-అధికమయిన దాని పేళ్ళు. Many

పరశ్శతాద్యా (స్తే యేషాం పరా సంఖ్యా శతాదికాత్). ౬౪

ఏషామ్-ఏవస్తువులకు, శతాదికాత్=నూరు మొదలయినసంఖ్యకంటె, పరా=అధికమయిన సంఖ్యా=సంఖ్యగలదో, తే=ఆవస్తువులు, పరశ్శతాద్యాః=పరశ్శతము మొదలైన పేళ్లుగలవి అగును. ఇవి సంఖ్యామాత్ర వాచకములై నపుంసక

గణనీయే గాణేయం

గణనీయమ్-గాణేయమ్ (పా) గణేయమ్ లెక్క పెట్టదగినదాని పేళ్లు.

సంఖ్యాతే గణిత (మథ) సమం సర్వమ్, విశ్వ మశేషం కృత్స్నం

సంఖ్యాతమ్-గణితమ్॥ ౨-లెక్క పెట్టబడిన సమమ్-సర్వమ్-విశ్వమ్- అశేషమ్ - కృత్స్నమ్- సమస్తమ్- నిఖిలమ్ - అఖిలమ్ - నిశ్శేషమ్

సమస్త నిఖిలాఖిలాని నిశ్శేషమ్. ౬౫. సమగ్రసకలాఖణ్డపూర్ణాదీన్యప్యనూనకే,

సమగ్రమ్- సకలమ్- అఖణ్డమ్-పూర్ణమ్- అనూనకమ్॥ ఈగరను-ఆదిపదముచేతసంపూర్ణమ్-పుష్కలమ్- అవికలమ్-అభిన్నమ్- ఇవి మొదలయినవియు-అంతయుననునర్థము పేళ్ళు. [దాని పేళ్ళు

ఘనం నిరన్తరం సాన్ద్రం

ఘనమ్-నిరన్తరమ్-సాన్ద్రమ్॥ 3-దట్టమయిన

పేలవం విరళం తను.

పేలవమ్-విరళమ్-తను॥ 3-పలుచనిదాని పేళ్లు.

సమీపే నికటాఽసన్న సన్నికృష్ట సనీడ (వత్). సదేశాభ్యాశ సవిధ సమర్యాద సవేశ (వత్). ఉపకణ్ఠాన్తికాభ్యర్ణాభ్యగ్రా అప్యభితోఽ(వ్యయమ్),

సమీపమ్-నికటమ్-ఆసన్నమ్- సన్నికృష్టమ్-సనీడమ్-సదేశమ్-అభ్యాశమ్[పా] అభ్యాసమ్-సవిధమ్-సమర్యాదమ్-సవేశమ్-ఉపకణ్ఠః-అన్తికః-అభ్యర్ణః-అభ్యగ్రః- అభితః॥స॥౧౫-దాపు పేళ్ళు. అభితః-అనునది యవ్యయము. Near

సంసక్తే త్వవ్యవహితమపదాన్తర(మిత్యపి).

సంసక్తః-అవ్యవహితమ్-అపదాన్తరమ్॥ 3-కదిసినదాని పేళ్ళు. [సయినదాని పేళ్లు.

నేదిష్ఠమన్తికతమం

నేదిష్ఠమ్-అన్తికతమమ్॥ ౨-మిక్కిలియుదా

స్యాద్దూరం విప్రకృష్టకమ్,

దూరమ్-విప్రకృష్టకమ్॥ ౨- దవ్వయినదాని పేళ్ళు. Distant

దవీయశ్చ దవిష్ఠంచ సుదూరం

దవీయః॥న్॥- దవిష్ఠమ్- సుదూరమ్- 3-మిక్కిలిదవ్వయినదాని పేళ్లు. Very far

దీర్ఘమాయతమ్.

దీర్ఘమ్-ఆయతమ్- ౨-నిడుపయిన దాని పేళ్లు.

వర్తులం నిస్తలం వృత్తం

వర్తులమ్- నిస్తలమ్-వృత్తమ్॥3- వట్రువైన దాని పేళ్లు. Circular

బన్ధురం (తూన్నతానతమ్),

బన్ధురమ్॥౧ - ఉన్నతానతం=స్వభావముచేతపొడవై యుపాధివశమునవంచుక వంగినదాని పేరు.

ఉచ్చప్రాంశూన్నతోదగ్రోచ్ఛ్రితాస్తుఙ్గేఽథ వామనే, న్యఙ్నీచఖర్వహ్రస్వా (స్యుః)

ఉచ్చః - ప్రాంశుః - ఉన్నతః - ఉదగ్రః - ఉచ్ఛ్రితః-తుఙ్గః॥౬-పొడవయినదాని పేళ్లు. Tall

వామనః-న్యఙ్॥చ్॥- నీచః-ఖర్వః- హ్రస్వః-౫-కుఱుచైనదాని పేళ్ళు. Short.

రవాగ్రేఽవన తాన తమ్.

అవాగ్రమ్-అవనతమ్-ఆనతమ్॥3. వంగిన దానిపేళ్ళు.

అరాళం వృజినం జిహ్మ మూర్మిమత్కుఞ్చితం నతమ్. ౭౧. ఆవిద్ధం కుటిలం భుగ్నం వేల్లితం వక్ర మిత్యపి,

అరాళమ్- వృజినమ్- జిహ్మమ్ - ఊర్మిమత్॥ కుఞ్చితమ్-నతమ్ ఆవిద్ధమ్-కుటిలమ్-భుగ్నమ్-వేల్లితమ్-వక్రమ్॥౧౧- వంకరయైనదాని పేళ్ళు. Crooked

ఋజా వజిహ్మ ప్రగుణౌ వ్యస్తే త్వప్రగు ణాకులౌ. ౭౨

ఋజుః-అజిహ్మః-ప్రగుణః-3- చక్కనైయున్న [దుదానిపేళ్ళు. వ్యస్తఃఅప్రగుణః - ఆకులః॥3-చెదరినదాని పేళ్ళు. Confused

శాశ్వతస్తు ధ్రువో నిత్య సదాతన సనాతనాః,

శాశ్వతః-ధ్రువః-నిత్యః-సదాతనః-సనాతనః-ఎన్నటికిని నాశము లేకయుండుదానిపేళ్లు.

స్థాస్నుః స్థిరతరః స్థేయా

స్థాస్నుః-స్థిరతరః- స్థేయాన్॥న్॥3 - పెక్కు కాలముండుదానిపేళ్లు Firm

(నేకరూపతయా తు యః. కాలవ్యాపీ స) కూటస్థః

కూటస్థః॥పు॥ ౧-ఏకరూపతయా=వికారము లేకయొకలాగుననే, యః కాలవ్యాపీ=ఎదినిమి క కాలముండునదో యట్టియాత్మాదులపేరు.

స్థావరో (జఙ్గమేతరః), చరిష్ణు జఙ్గమ చరం త్రస మిఙ్గం చరాచరమ్.

స్థావరః॥౧-కదలకయుండుగిరివృక్షాదులపేరు. చరిష్ణుః-జఙ్గమమ్-చరమ్- త్రసమ్-ఇఙ్గమ్-చరాచరమ్॥౬-తిరుగులాడు మనుష్యాదులపేళ్ళు.

చలనం కమ్పనం కమ్ప్రం

చలనమ్-కమ్పనమ్-కమ్ప్రమ్॥3 - కదలు భావముగల యశ్వత్థదళాదులపేళ్ళు.

చలం లోలం చలాచలమ్, చఞ్చలం తరళం (చైవ) పారిప్లవపరిప్లవే.

చలమ్-లోలమ్-చలాచలమ్ చఞ్చలమ్-తరళమ్ పారిప్లవమ్- పరిప్లవమ్॥౭-కదలుదానిపేళ్ళు. [దానిపేళ్ళు moving.

అతిరిక్త స్సమధికో

అతిరిక్తః-సమధికః॥౨- మిక్కిలియధికమైన

దృఢసన్ధి స్తు సంహతః,

దృఢసన్ధిః-సంహతః ॥౨- దృఢమయినకీలు యవయవాదుల పేళ్ళు. లెస్సగా నదికినది

కర్కశం కఠినం క్రూరం కఠోరం నిష్ఠురం దృఢమ్. ౭౬. జఠరం మూర్తిమన్మూర్తం

కర్కశమ్(పా)కక్ఖటమ్-కఠినమ్-క్రూరమ్-కఠోరమ్-నిష్ఠురమ్-దృఢమ్-జఠరమ్-మూర్తిమత్॥త్॥-మూర్తమ్॥౯-బిరుసైనదాని పేళ్ళు, గట్టిది.

ప్రవృద్ధం ప్రౌఢ మేధితమ్.

ప్రవృద్ధమ్-ప్రౌఢమ్-ఏధితమ్॥ 3-పెరిగినదాని పేళ్ళు. Full-Grown

పురాణప్రతన ప్రత్న పురాతన చిరంతనాః.

పురాణః-ప్రతనః-ప్రత్నః-పురాతనః-చిరంతనః॥౫-ప్రాతవాని పేళ్ళు. Old

ప్రత్యగ్రో౽భినవో నవ్యో నవీనో నూతనో నవః. నూత్నశ్చ

ప్రత్యగ్రః-అభినవః-నవ్యః-నవీనః-నూతనః-నవః-నూత్నః॥౭-క్రొత్తనాని పేళ్ళు.

సుకుమారం తు కోమలం మృదులం మృదు.

సుకుమారమ్-కోమలమ్-మృదులమ్-మృదు॥౪-మెత్తనిదాని పేళ్ళు. Lost

అన్వగన్వక్ష మనుగే౽నుపదం (క్లీబ మవ్యయమ్),

అన్వక్॥చ్॥-అన్వక్షమ్-అనుగమ్-అనుపదమ్॥౪ - వెనుకపోవువాని పేళ్ళు. అనుపదమ్॥న-అ॥. Following.

ప్రత్యక్షం (స్యా)దైన్ద్రియక మప్రత్యక్ష మతీన్ద్రియమ్. ౭౯

ప్రత్యక్షమ్-ఐన్ద్రియకమ్-॥౨ - నేత్రాదిపంచేంద్రియములచేత నెఱుంగఁబడుదాని పేళ్ళు.

అప్రత్యక్షమ్ (పా) అత్యధ్యక్షమ్ - అతీన్ద్రియమ్॥౨- నేత్రాదిపంచేంద్రియములచేత నెఱుఁగఁబడనిరూపరసాదుల పేళ్ళు. Absent.

ఏకతానో౽నన్యవృత్తి రేకాగ్రైకాయనా (వపి, అ) ప్యేకసర్గ ఏకాగ్ర్యో౽ప్యేకాయనగతో౽(పిచ). ౮౦

ఏకతానః-అనన్యవృత్తిః-ఏకాగ్రః-ఏకాయనః-ఏకసర్గః-ఐకాగ్ర్యః-ఏకాయనగతః॥౭- ఏకాగ్రచిత్తుని పేళ్ళు.

(పుం) స్యాదిః పూర్వః పౌరస్త్యప్రథమాద్యా (అథాస్త్రియామ్), అ

ఆదిః॥నియతపుంలింగము పూర్వః-పౌరస్త్యః-ప్రథమః-ఆద్యః॥౫-మొదటిదాని పేళ్ళు. First.

అన్తః॥న్త॥ జఘన్యమ్-చరమమ్-అన్త్యమ్-

న్తోజఘన్యం చరమ మ న్త్య పాశ్చాత్య పశ్చిమాః. ౮౧

పాశ్చాత్యమ్-పశ్చిమమ్॥ ౬- తుదయైన దాని పేళ్ళు. Last

[దానిపేళ్ళు

మోఘం నిరర్థకం

మోఘమ్ - నిరర్థకమ్॥ ౨-ప్రయోజనము లే

స్పష్టం స్ఫుటం ప్రవ్య క్తముల్బణమ్,

స్పష్టమ్ - స్ఫుటమ్ - ప్రవ్యక్తమ్ - ఉల్బణమ్ ౪-ప్రకటమయిన దాని పేళ్ళు. Evident

సాధారణం తు సామాన్య

సాధారణమ్ సామాన్యమ్॥ ౨-అనేకులకు చెందినదాని పేళ్ళు[యొక్కటియైన దాని పేళ్ళు

మేకా కీత్వేక ఏకకః.

ఏకాకీ॥న్॥ ఏకః-ఏకకః॥ 3-సహాయము లే

(భిన్నార్థకా) అన్యతర ఏక త్వా న్యేత రా (అపి),

అన్యతరః-ఏకః-త్వః-అన్యః - ఇతరః ॥౫- భిన్నార్థకాః = ప్రకృతార్థముకంటె వేరైనదాని పేళ్ళు. ఇవి సర్వనామశబ్దములు. Other

ఉచ్చావచం నైకభేద

ఉచ్చావచమ్-నైకభేదమ్॥ ౨-అనేక ప్రకారములయినచిత్రాదుల పేళ్లు. [పేళ్ళు

ముచ్చణ్డమవిలమ్బితమ్

ఉచ్చణ్డమ్-అవిలమ్బితమ్॥౨- త్వరగలదాని

అరున్తుద స్తు మర్మస్పృ

అరున్తుదః-మర్మస్పృక్ ॥శ్॥ ౨- మనస్సును నొప్పించుమాటలు మొదలయినదాని పేళ్ళు

గబాధం తునిర్గరళమ్.

అబాధమ్ - నిరర్గళమ్॥ ౨-అడ్డసాటు లేని దాని పేళ్ళు.

ప్రసవ్యం ప్రతికూలం (స్యా)దపసవ్య మపష్ఠు చ. ౮౪

ప్రసవ్యమ్- ప్రతికూలమ్- అపసవ్యమ్-అపష్ఠు॥౪-ప్రతికూలమయినదాని పేళ్ళు. Contrary

వామం (శరీరే) సవ్యం (స్యా)

వామమ్- సవ్యమ్॥ ౨-శరీరే=శరీరమున యెడమపార్శ్వము పేళ్ళు. Left

దపసవ్యం తు దక్షిణమ్,

అపసవ్యమ్-దక్షిణమ్॥ ౨-శరీరమున కుడి దిక్కు పేళ్ళు. Right

సంకటం (నాతు) సంబాధః

సంకటమ్-సంబాధః॥ ౨- ఇరకటపు చోటి పేళ్ళు. సంబాధశబ్దము నియతపుంలింగము.

కలిలం గహనం (సమే). ౮౫

కలిలమ్- గహనమ్॥ ౨ - చొరరానిదానికిని ఎఱుగరానిదానికిని పేళ్ళు.

సంకీర్ణే సంకులాఽకీర్ణే
ముణ్డితం పరివాపితం,
గ్రథితం గ్రన్థితం దృబ్ధం
విసృతం విస్తృతం తతం.
అన్తర్గతం విస్మృతం (స్యాత్)
ప్రాప్త ప్రణిహితే (సమే)
వేల్లిత ప్రేఙ్ఖితాఽధూత
చలితాఽకమ్పితా ధుతే. ౮౭

నుత్త నున్నాస్త ని
ష్ఠ్యూత విద్ధ క్షిప్తేరితాః
(సమాః)
పరిక్షిప్తం తు నివృతం
మూషితం ముషితా
ర్థకం). ౮౮
ప్రవృద్ధ ప్రసృతే
న్యస్త నిసృష్టే
గుణితాఽహతే,
నిదిగ్ధోపచితే
గూఢ గుప్తే
గుణ్ఠిత రూషితే. ౮౯
ద్రుతావదీర్ణే
ఉద్గూర్ణోద్యతే

సంకీర్ణమ్-సంకులమ్-ఆకీర్ణమ్॥3-ఒకటికొకటి కలిసినదానిపేళ్ళు. Crowded. [దానిపేళ్ళు.
ముణ్డితమ్-పరివాపితమ్॥ ౨-గొఱుగఁబడిన
గ్రథితమ్-గ్రన్థితమ్-దృబ్ధమ్॥ 3-కూర్పఁబడిన పుష్పమాలికాదులపేళ్ళు 'గ్రన్థితంగుమ్ఫితం దృబ్ధమ్' అనిపాఠముగలదు. [నిపేళ్లు, విరివిగలది.
విసృతమ్-విస్తృతమ్-తతమ్॥3-వ్యాపించినదా
అన్తర్గతమ్-విస్మృతమ్॥ ౨-మఱువఁబడిన దానిపేళ్ళు. Forgotten. [పేళ్ళు.
ప్రాప్తమ్-ప్రణిహితమ్॥ ౨-పొందఁబడినదాని
వేల్లితః-ప్రేఙ్ఖితః-ఆధూతః-చలితః-ఆకమ్పితః-ధుతః॥ ౬-కదలింపఁబడిన దానిపేళ్ళు. Shaken.

నుత్తః-నున్నః-అస్తః-నిష్ఠ్యూతః-విద్ధః-క్షిప్తః-ఈరితః॥౭-త్రోయఁబడినదానిపేళ్ళు.
[దానిచేతఁ జుట్టఁబడినదానిపేళ్లు.
పరిక్షిప్తమ్-నివృతమ్॥ ౨-కోట మొదలయిన
మూషితమ్-ముషితమ్॥ ౨-దొంగలింపఁబడినదానిపేళ్ళు. Concealed. [దానిపేళ్ళు.
ప్రవృద్ధమ్-ప్రసృతమ్॥ ౨-కొనసాగ పెరుఁగు
న్యస్తమ్-నిసృష్టమ్॥ ౨-ఉంచబడినదానిపేళ్ళు.
గుణితమ్-ఆహతమ్॥ ౨-గుణింపఁబడినసంఖ్య పేళ్ళు. Multiplied. [దులపేళ్ళు.
నిదిగ్ధః-ఉపచితః॥ ౨-కొలఁత హెచ్చినధాన్యా
గూఢమ్-గుప్తమ్॥ ౨-దాఁచఁబడినదానిపేళ్ళు.
గుణ్ఠితమ్-రూషితమ్॥ ౨-ధూళ్యాదులచేతఁ గప్పఁబడినదానిపేళ్ళు.
ద్రుతమ్-అవదీర్ణమ్॥ ౨-కరఁగించినదానిపేళ్ళు.
ఉద్గూర్ణమ్-ఉద్యతమ్॥ ౨-పొడవుగా నెత్తఁ

౨౦౩ కాచిత శిక్యి తే,

ఘ్రాణ ఘ్రా తే

దిగ్ధ లి ప్తే
సముదక్తోద్ధృ తే (సమే),
వేష్టితం స్యా ద్వలయి
తం సంవీతం రుద్ధ మా
౨౦౪ వృతమ్,
రుగ్ణ భు గ్నే ఽథ
నిశిత క్ష్ణుత శాతాని
తేజి తే.

(స్యా ద్వినాశోన్ముఖం)
పక్వం
౨౦౫ హ్రీణ హ్రీతౌ తు లజ్జి తే,
వృ తే తు వృ త్త వా
వృత్తౌ
సంయోజిత ఉపాహి
తః.
పాప్యం గమ్యం స
మాసాద్యం
స్యన్నం రీణం స్రుతం
౨౦౬ స్నుతం,
సంగూఢ (స్సా ద్ధ)
త్సంకలితోఽ
వగీతః ఖ్యాతగ ర్హణః.
వివిధ(స్స్యా) ద్బహు

బడినదాని పేళ్ళు. Raised.

కాచితమ్-శిక్యితమ్॥ ౨-ఉట్టియందుఁ బెట్టఁబడిన దాని పేళ్ళు ఇచట 'కారితశిక్షి తే' అనుపాఠమున లౌకిక వైదికకర్మములయందు కృతాభ్యాసుని పేళ్లు

ఘ్రాణమ్-ఘ్రాతమ్॥ ౨-మూర్కొనఁబడిన దాని పేళ్ళు. Smelled

దిగ్ధమ్-లి ప్తమ్॥ ౨-పూయఁబడినదాని పేళ్ళు. సముద క్తం-ఉద్ధృతం॥ ౨ చేఁదఁబడినదాని పేళ్లు.

వేష్టితమ్-వలయితమ్-సంవీతమ్-రుద్ధమ్-ఆవృతమ్॥ ౫- నద్యాదులచేతఁ జుట్టఁబడిన పట్ట ణాదుల పేళ్ళు.

రుగ్ణమ్-భుగ్నమ్॥ ౨-విఱువఁబడినదాని పేళ్ళు. నిశితమ్-క్ష్ణుతమ్-శాతమ్-తేజితమ్॥ ౪ - వాఁడి గా జేయఁబడిన యాయుధముల పేరు. Whetted

పక్వమ్॥ ౧-వినాశోన్ముఖమ్= నశింపనాయి మయినదాని పేళ్ళు. Mature

హ్రీణః-హ్రీతః-లజ్జితః॥ 3-సిగ్గువడినదాని పేళ్ళు.

వృతః-వృ త్తః-వావృ త్తః॥ 3-కన్యాదుల వరింపఁబడినవరుఁడు మొదలయినవాని పేళ్లు.

సంయోజితః-ఉపాహితః॥ ౨-మఱియొకపదా ర్థముతోఁ గూర్పఁబడినదాని పేళ్లు. Annexed

పాప్యమ్-గమ్యమ్-సమాసాద్యమ్॥ 3-పొం దఁదగినవస్తువు పేళ్ళు. Attainable

స్యన్నమ్-రీణమ్-స్రుతమ్-స్నుతమ్॥ ౪ కా నీళ్లు మొదలయినదాని పేళ్ళు. Dropping

సంగూఢః-సంకలితః॥ ౨-కూర్పఁబడినవాని పేళ్లు. Arranged. [దగలవాని పేళ్లు

అవగీతః-ఖ్యాతగర్హణః॥ ౨-ప్రసిద్ధమైన

వివిధః-బహువిధః-నానారూపః-పృథగ్విధః

| | |
|---|---|
| విధో నానారూపః పృథగ్విధః, | ౪-పెక్కువిధములయినవస్తువు పేళ్ళు. Various. [నిపేళ్ళు. |
| అవరీణోధిక్కృతస్సా | అవరీణః-ధిక్కృతః॥ ౨-ధిక్కరింపఁబడినదా |
| దపధ్వస్తోఽవచూర్ణితః. ౯౪ | అపధ్వస్తః-అవచూర్ణితః॥ ౨-పొడిగాఁగొట్టఁబడినదాని పేళ్ళు. Pounded. |
| (అనాయాసకృతం) ఫాణ్టం | ఫాణ్టమ్॥ ౧-అనాయాసకృతమ్=ఆయాసము లేక చేయఁబడిన కషాయాదుల పేళ్లు. |
| స్వనితంధ్వనితం (సమే), | స్వనితమ్-ధ్వనితమ్॥ ౨-మ్రోయుదాని పేళ్లు. |
| బద్ధే సన్దానితం మూతముద్దితం సన్దితం సితమ్. | బద్ధమ్-సన్దానితమ్-మూతమ్- ఉద్దితమ్-సన్దితమ్-సితమ్॥ ౬-కట్టఁబడినదాని పేళ్లు. Bound. |
| నిష్పక్వం క్వథితం | నిష్పక్వమ్-క్వథితమ్॥ ౨ - ఎనిమిదవపాలు మిగులునట్లు కాఁచబడిన కషాయాదుల పేళ్లు. |
| (పాకే క్షీ రాఽజ్యహవిషాం) శృతం, | శృతమ్॥౧-క్షీరాఽజ్యహవిషామ్ = పాలునెయ్యిహవిస్సులయొక్క, పాకే=పాకము పేరు. |
| నిర్వాణో (మునివహ్న్యదౌ) | నిర్వాణః॥౧-మునివహ్న్యదౌ= శాంతుఁడైన మునికిని అగ్ని మొదలయినదానికిని పేరు. |
| నిర్వాత (స్తు గతేఽనిలే.) ౯౬ | నిర్వాతః॥౧-గతే అనిలే = సంచారముడిగిన వాయువు పేరు. |
| పక్వం పరిణతే | పక్వమ్-పరిణతమ్॥ ౨-కాలవశమునఁబరిపాకమును బొన్దినబుద్ధి మొదలయినదాని పేళ్లు. Ripe. |
| గూనం హన్నే | గూనమ్-హన్నమ్॥ ౨-విడువఁబడినవిష్ఠ పేళ్లు. |
| మీఢం తు మూత్రితే, | మీఢమ్-మూత్రితమ్॥ ౨-విడువఁబడినమూత్రము పేళ్ళు. |
| పుష్టే తు పుషితం | పుష్టమ్-పుషితమ్॥ ౨ - పోషింపఁబడినపక్షిమృగాదుల పేళ్ళు. [మొదలయునదాని పేళ్లు. |
| సోఢే క్షాన్త ముద్వాన్త ముద్గతే. | సోఢమ్-క్షాన్తమ్॥ ౨-ఓర్వఁబడినతిట్టుకొట్టు |
| | ఉద్వాన్తమ్-ఉద్గతమ్॥ ౨-ఒకదానివ్రక్కలింపఁబడినదాని పేళ్ళు. Vomitted. |
| దాన్తస్తు దమితే | దాన్తః-దమితః॥ ౨-ఆచార్యాదులచేతశిక్షిం |

పఁబడినశిష్యాదుల పేళ్లు. భారక్లేశాదులనుసహించినదాని పేళ్లని కొందఱందురు. [పేళ్లు.

౨౨౧ శాన్తశ్శమితే ప్రార్థితేఽర్దితః, జ్ఞప్తస్తుజ్ఞాపితే

శాన్తః-శమితః॥ ౨-శమింపఁబడినరాగాదుల పేళ్లు.
ప్రార్థితః-అర్దితః॥ ౨-అడుగఁబడినవస్తువు పేళ్లు.
జ్ఞప్తః-జ్ఞాపితః॥ ౨ - గురూపదేశాదులచేత నెఱింగింపఁబడినదాని పేళ్లు. "జ్ఞపితే" అనుపాఠమునందు హింసింపఁబడినదాని పేళ్ళు.

ఛన్నశ్ఛాదితే పూజితేఽఞ్చితః. పూర్ణస్తుపూరితే

ఛన్నః-ఛాదితః॥ ౨-కప్పఁబడినదాని పేళ్లు.
పూజితః-అఞ్చితః॥ ౨-పూజింపఁబడినదాని పేళ్లు.
పూర్ణః-పూరితః॥ ౨-జలాదులచేతనిండింపఁబడినకలశాదుల పేళ్లు. [బడినమనుష్యాదుల పేళ్లు.

క్లిష్టః క్లిశితేఽవసితే సితః,

క్లిష్టః-క్లిశితః॥ ౨-దారిద్ర్యాదులచేతఁబీడింప
౨౨౨ అవసితః-సితః॥ ౨-ముగిసినదాని పేళ్ళు.

ప్రుష్టప్లుష్టోషితా దగ్ధే

ప్రుష్టః-ప్లుష్టః-ఉషితః-దగ్ధః॥ ౪ కాల్పఁబడినదాని పేళ్లు. Burnt. [స్థాదుల పేళ్లు.

తష్టత్వష్టౌ తనూకృతే, వేధితచ్ఛిద్రితౌ విద్ధే

తష్టః-త్వష్టః-తనూకృతః॥3 చెక్కఁబడినకా
వేధితః-ఛిద్రితః-విద్ధః॥ 3-బెజ్జము వేయఁబడినరత్నాదుల పేళ్లు. [కార్యాదుల పేళ్లు.

౨౨౩ విన్నవిత్తౌ విచారితే, నిష్ప్రభే విగతారోకౌ

విన్నః-విత్తః-విచారితః॥ 3-విచారింపఁబడిన
నిష్ప్రభః-విగతః-అరోకః॥ 3-కాంతిలేనిదివాచంద్రాదుల పేళ్లు. ఇచట "నిష్ప్రభేవిగతాలోకౌ" అని పాఠముగలదు. [దుల పేళ్లు.

విలీనే విద్రుతద్రుతౌ. సిద్ధే నిర్వృత్తనిష్పన్నౌ

విలీనః-విద్రుతః - ద్రుతః॥ 3 - కరఁగినఘృతా
సిద్ధః-నిర్వృత్తః-నిష్పన్నః॥ 3-పాకాదులచేనాయత్తమయినయన్నాదుల పేళ్లు. [దాని పేళ్లు.

దారితే భిన్నభేదితౌ, ఊతం స్యూతముతం చేతి (త్రితయం తన్తు సన్తతే).

దారితః-భిన్నః-భేదితః॥3 - వ్రక్కలింపఁబడిన
ఊతమ్-స్యూతమ్-ఉతమ్॥3 - తన్తుసన్తతదారముచే గుట్టఁబడిన వస్త్రాదుల పేళ్లు. Stitch

(స్యా)దర్హితే నమస్యిత నమసిత మపచాయి తార్చి తాపచితం.

అర్హితమ్-నమస్యితమ్-నమసితమ్ - అపచాయితమ్-అర్చితమ్-అపచితమ్ ॥౬-పూజింపఁబడిన దేవతాదులపేళ్లు. Saluted.

వరివసితే వరివస్యిత ముపాసితం చోపచరితంచ.

వరివసితమ్- వరివస్యితమ్-ఉపాసితమ్-ఉపచరితమ్॥౪ - సేవింపఁబడిన యుపాధ్యాయుని పేళ్ళు.

సన్తాపిత స న్తప్తౌ ధూపిత ధూపాయితౌ చ దూనశ్చ,

సన్తాపితః-సన్తప్తః- ధూపితః-ధూపాయితః- దూనః॥౫-తపింపఁబడినదాని పేళ్ళు.

హృష్టో మత్త స్తృప్తః ప్రహ్లన్నః ప్రముదితః ప్రీతః. ౧౦౩

హృష్టః - మత్తః-తృప్తః-ప్రహ్లన్నః-ప్రముదితః-ప్రీతః॥౬-సంతోషించినవాని పేళ్లు. Content.

ఛిన్నం ఛాతం లూనం కృత్తం దాతం దితం ఛితం వృక్ణం,

ఛిన్నం - ఛాతమ్ - లూనమ్-కృత్తమ్-దాతమ్-దితమ్-ఛితమ్ - వృక్ణమ్॥౮ - కోయఁబడిన తృణాదుల పేళ్ళు. Cut.

స్రస్తం ధ్వస్తం భ్రష్టం స్కన్నం పన్నం చ్యుతం గళితం. ౧౦౪

స్రస్తమ్-ధ్వస్తమ్- భ్రష్టమ్-స్కన్నమ్-పన్నమ్-చ్యుతమ్ -గళితమ్॥ ౭ - జాఱిపడినదాని పేళ్ళు. Fallen.

లబ్ధం ప్రాప్తం విన్నం భావిత మాసాదితం చ భూతంచ,

లబ్ధమ్-ప్రాప్తమ్-విన్నమ్ - భావితమ్-ఆసాదితమ్-భూతమ్॥౬-పొందఁబడినదాని పేళ్ళు. Got.

అన్వేషితం గవేషిత మన్విష్టం మార్గితం మృగితం. ౧౦౫

అన్వేషితమ్-గవేషితమ్ - అన్విష్టమ్-మార్గితమ్-మృగితమ్॥ ౫- వెదుకఁబడినదాని పేళ్ళు. Sought.

ఆర్ద్రం సార్ద్రం క్లిన్నం తిమితం స్తిమితం సమున్న ముత్తం చ.

ఆర్ద్రమ్- సార్ద్రమ్-క్లిన్నమ్-తిమితమ్- స్తిమితమ్-సమున్నమ్-ఉత్తమ్॥౭-తడివస్తువు పేళ్ళు. Wet.

త్రాతం త్రాణం రక్షిత మవితం గోపాయితం గుప్తం. ౧౦౬

త్రాతమ్-త్రాణమ్-రక్షితమ్-అవితమ్ - గోపాయితమ్-గుప్తమ్॥ ౬-రక్షింపఁబడినదాని పేళ్ళు. Preserved.

అవగణిత మవమ తా
వజ్ఞాతే అవమానితం చ
పరిభూతే,

అవగణితమ్-అవమతమ్ - అవజ్ఞాతమ్ - అవమానితమ్-పరిభూతమ్॥ ౫ - తిరస్కరింపఁబడినదానిపేళ్ళు. Desrised

త్యక్తం హీనం విధు
తం సముజ్ఝితం ధూత
ముత్సృష్టం. ౧౦౭

త్యక్తమ్ - హీనమ్-విధుతమ్- సముజ్ఝితమ్-ధూతమ్-ఉత్సృష్టమ్॥౬-విడువఁబడినదానిపేళ్లు. Abandoned

ఉక్తం భాషిత ముది
తం జల్పిత మాఖ్యాత
మభిహితం లపితం,

ఉక్తమ్-భాషితమ్ - ఉదితమ్ - జల్పితమ్-ఆఖ్యాతమ్-అభిహితమ్-లపితమ్॥ ౭-పలుకఁబడినదానిపేళ్ళు. Spoken

బుద్ధం బుధితం మని
తం విదితం ప్రతిపన్న
మవసి తావగతే. ౧౦౮

బుద్ధమ్-బుధితమ్-మనితమ్-విదితమ్ - ప్రతిపన్నమ్-అవసితమ్-అవగతమ్॥ ౮-ఎఱుఁగఁబడినదానిపేళ్లు. Known

ఊరీకృత మురరీకృత
మఙ్గీకృత మాశ్రుతం
ప్రతిజ్ఞాతం, సంగీర్ణ
విదిత సంశ్రుత సమా
హిత ముపశ్రు తోప
గతం.

ఊరీకృతమ్ [ప] ఉరీకృతమ్ - ఉరరీకృతమ్-అంగీకృతమ్-ఆశ్రుతమ్- ప్రతిజ్ఞాతమ్-సంగీర్ణమ్-విదితమ్-సంశ్రుతమ్-సమాహితమ్-ఉపశ్రుతమ్-ఉపగతమ్॥౧౧-అంగీకరింపఁబడినదానిపేళ్ళు. Consented

ఈడిత శస్త పణా
యిత పనాయిత ప్రణు
త పణిత పనితాని, అ
వగీర్ణ వర్ణి తాభిష్టు తే
ళితాని స్తుతార్థాని.

ఈడితమ్ - శస్తమ్-పణాయితమ్ - పనాయితమ్-ప్రణుతమ్-పణితమ్- పనితమ్-అవగీర్ణమ్-వర్ణితమ్-అభిష్టుతమ్-ఈళితమ్-స్తుతమ్॥ ౧౨-పొగడఁబడిన దేవతాదులపేళ్ళు. Praised

భక్షిత చర్విత లిప్త
ప్రత్యవసిత గళిత ఖా
దిత ప్సాతం, అభ్యవ
హృతాన్న జగ్ధ గ్రస్తగ్ల
స్తాశితం భుక్తే. ౧౧౧

భక్షితమ్-చర్వితమ్-లిప్తమ్[పా]లీఢమ్-ప్రత్యవసితమ్-గళితమ్ (పా) గిళితమ్ - ఖాదితమ్-ప్సాతమ్-అభ్యవహృతమ్-అన్నమ్ - జగ్ధమ్-గ్రస్తమ్-గ్లస్తమ్-అశితమ్- భుక్తమ్॥౧౪-భుజింపఁబడిన యన్నాదులపేళ్లు. Eaten

క్షేపిష్ఠ ... క్షేపిష్ఠ = మిక్కిలి వేగముగలది,

వరిష్ఠ స్థవిష్ఠ బంహిష్ఠాః, క్షిప్ర, క్షుద్ర, ప్రాభీప్సిత పృథుపీవర (బహుల ప్రకర్షార్థాః). ౧౧౨

మిక్కిలి క్షుద్రమయినది, ప్రేష్ఠః = మిక్కిలి ప్రియమయినది, వరిష్ఠః=మిక్కిలివిరివియైనది, స్థవిష్ఠః = మిక్కిలి బలిసినది, బంహిష్ఠః = మిక్కిలి తఱచైనది. ఇవి క్షిప్రాదు లాటింటియతిశయముల పేళ్ళు.

సాధిష్ఠ ద్రాఘిష్ఠ స్ఫేష్ఠ గరిష్ఠ హ్రసిష్ఠ బృన్దిష్ఠాః, (బాఢ వ్యాయత బహు గురు వామన బృన్దారకాతిశయే.) ౧౧౩

సాధిష్ఠః=మిక్కిలి పదిలమయినది, ద్రాఘిష్ఠః = మిక్కిలినిడుపయినది, స్ఫేష్ఠః = మిక్కిలి యనేకమయినది, గరిష్ఠః = మిక్కిలిభారమయినది, హ్రసిష్ఠః=మిక్కిలికుఱుచైనది, బృన్దిష్ఠః = మిక్కిలి మనోహరమయినది, ఇవి బాఢాదు లాఱింటి యతిశయముల పేళ్ళు.

ఇతి విశేష్యనిఘ్నవర్గః. విశేషణములైన పదసమూహము ముగిసెను.

---

గ్రంథకర్త మునుపుచెప్పినరూపభేదాదులచేతను ప్రకృతిప్రత్యయార్థములచేతను నీ సంకీర్ణవర్గమందు లింగము నెఱుఁగవలె నని చెప్పుచున్నాఁడు :—

మూ. ప్రకృతిప్రత్యయార్థాద్యైః సంకీర్ణే లిఙ్గమున్నయేత్,

టీక. సంకీర్ణే=ఈసంకీర్ణవర్గమందు, ప్రకృతిప్రత్యయార్థాద్యైః = నామార్థప్రత్యయార్థ రూపభేద సాహచర్యములచేతను, లిఙ్గమ్=స్త్రీపున్నపుంసకలింగములను, ఉన్నయేత్ = ఊహింపవలెను. నామార్థముచే నెట్లనఁగా:— "అపరస్పరాఃపురుషాః - అపరస్పరాః స్త్రియః- అపరస్పరాణి కులాని" ప్రత్యయార్థముచేత నెట్లనిన:— 'శాన్తిః - దాన్తిః' ఇవి 'స్త్రియాం క్తిన్, అను సూత్రముచేత స్త్రీలింగబోధకమయిన తిప్రత్యయాంతములు గనుక స్త్రీలింగములని యెఱుఁగవలయు. రూపభేద సాహచర్యములచే మునుపటివలె నెఱుఁగవలయు.

కర్మక్రియా (తత్సాతత్యే గమ్యా) రపరస్పరాః.

కర్మ॥న్-న॥(ప)పు॥-క్రియా॥సీ॥౨-చేయుట పేళ్లు. అపరస్పరః ॥త్రి॥ ౧- తత్సాతత్యేగమ్యే=ఎడతెగనిగమనాదిక్రియగల సార్థాదుల పేరు.

(సాకల్యాసఙ్గవచనే) పారాయణ పరాయణే,

పారాయణమ్॥న॥ పరాయణమ్ (పా)తురాయణమ్॥త్రి॥౨- సాకల్యాసఙ్గవచనే = వరుసగా

వాసితా (స్త్రీకరిణ్యోశ్చ)
వార్తా (వృత్తౌజనశ్రుత్యౌ), వార్తం (ఫల్గు న్యరోగేచ త్రి)

(వ్యప్సు చ) ఘృతామృతే. ౨౩౨

కలధౌతం (రూప్య హేమ్నోః)
ర్నిమిత్తం (హేతు లక్ష్మణోః),

శ్రుతం (శాస్త్రా వధృతయోః)

(యుగపర్యాప్తయోః) కృతమ్. ౨౩౩
అత్యాహితం (మహాభీతిః కర్మ జీవానపేక్షి చ),
(యుక్తే క్ష్మాదావృతే) భూతం (ప్రాణ్యతీతే సమే త్రిషు). ౨౩౪

మహతీ = అధికమైనదానికిని, అపిశబ్దమువలన తరీయములకును పేరు.

వాసితా [వ] వాసితా ॥ సీ ॥ ఇది, స్త్రీ = స్త్రీకిని, కరిణ్యోశ్చ = ఆడుఏనుఁగునకును పేరు.

వార్తా ॥ ఇది, వృత్తౌ = జీవనోపాయమునకును, జనశ్రుతౌ = లోకవార్తకును పేరైనపుడు ॥ సీ ॥, ఫల్గుని = తుచ్ఛమునకు పేరైనపుడు ॥ న ॥, అరోగే = రోగములేనివానికి పేరైనపుడు ॥ త్రి ॥.

ఘృతమ్ - అమృతమ్ ॥ న ॥ ఈ ౨-ను, అప్సు = నీళ్ళ పేళ్ళు. చకారమువలనఘృతశబ్దము నేతికి, అమృతశబ్దము అమృతమునకును, యజ్ఞవిశేషమునకును, అయాచితమునకును, మోక్షమునకును పేరు.

కలధౌతమ్ = ॥ న ॥ ఇది, రూప్య = వెండికిని, హేమ్నః = బంగారమునకును పేరు. Gold

నిమిత్తమ్ ॥ న ॥ ఇది, హేతు = కారణమునకును, లక్ష్మణోః = చిహ్నమునకును పేరు. Token

శ్రుతమ్ ॥ ఇది, శాస్త్ర = శాస్త్రమునకు పేరైనపుడు ॥ న ॥ అవధృతయోః = వినఁబడినదానికిని పేరయినపుడు ॥ త్రి ॥. Heard

కృతమ్ ॥ న ॥ ఇది, యుగ = కృతయుగమునకును, పర్యాప్తయోః - నివారణమునకును పేరు.

అత్యాహితమ్ ॥ న ॥ ఇది, మహాభీతిః = మహాభయమునకును, జీవానపేక్షి = ప్రాణము నపేక్షించని పని, కర్మ = సాహసమునకును పేరు.

భూతమ్ = ఇది, యుక్తే = యోగ్యమయినదానికిని, క్ష్మాదా = పంచభూతములకును, ఋతే = సత్యమునకును, ప్రాణి = ప్రాణిమాత్రమునకును, అతీతే = భూతకాలమునకును పేరైనపుడు ॥ న ॥, సమే = సమాసమునందు ఉత్తరపదమై సదృశవాచి

| | |
|---|---|
| | నకు పేరైనపుడు॥త్రి॥. |
| వృత్తం (పద్యే చరిత్రే త్రిష్వతీతే దృఢనిస్తలే), | వృత్తమ్॥ ఇది, పద్యే=పద్యమునకును, చరితే=చరిత్రమునకును పేరయినపుడు ॥న॥అతీతే=పోయినదానికిని, దృఢే=బటువైనదానికిని,నిస్తలే=వట్రునయినదానికిని పేరైనపుడు॥త్రి॥. |
| మహ (ద్రాజ్యం చా) | మహత్॥ఇది, రాజ్యమ్=రాజ్యమునకు పేరయినపుడు॥న॥, చకారమువలన దొడ్డవానికి పేరయినపుడు॥త్రి॥. |
| వగీతం (జనే్య స్యా ద్గర్హితే త్రిషు). ౨౩౫ | అవగీతమ్॥ ఇది, జనే్య=జనాపవాదమునకు [వ] యుద్ధమునకు పేరయినపుడు॥న॥,గర్హితే=నించింపఁబడినదానికి పేరయినపుడు॥త్రి॥. |
| శ్వేతం (రూప్యేఽపి) | శ్వేతమ్॥ఇది,రూప్యే=వెండికి పేరైనపుడు॥న అపిశబ్దమువలన తెల్లనివస్తువునకు పేరైనపుడు త్రి |
| రజతం (హేమ్ని రూప్యే సితే త్రిషు), | రజతమ్॥ఇది, హేమ్ని=బంగారమునకును,రూప్యే=వెండికిని పేరయినపుడు॥న॥, సితే= తెల్లనివస్తువునకు పేరయినపుడు॥త్రి॥. |
| (త్రి)ష్వథో | ఇది మొదలు తాంతశబ్దములన్నియు ॥త్రి॥ |
| జగ(దిఙ్గేఽపి) | జగత్ ॥త్రి॥ఇది,ఇఙ్గే=సంచరించువస్తువు పేరు, అపిశబ్దమువలన లోకమునకు పేరయినపుడు॥న॥, వాయువునకు పేరైనపుడు॥పు॥. |
| రక్తం (నీల్యాది రాగి చ). ౨౩౬ | రక్తమ్॥త్రి॥ఇది, నీల్యాది=నీలి మొదలయినదానిచేత, రాగి=చాయ వేయఁబడినవస్త్రాదులకును, చకారమువలన అనురక్తునికిని, ఎఱ్ఱనైనదానికిని పేరు. కుంకుమమునకును నెత్తురునకును పేరయినపుడు॥న॥. |
| అవదాత (స్సితే పీతే శుద్ధే) | అవదాతః॥త్రి॥ఇది, సితే= తెల్లనివస్తువునకును, పీతే=పచ్చనివస్తువునకును, శుద్ధే=పరిశుద్ధమయినవస్తువునకును పేరు. తెల్లనివస్తువునకును పేరు. |
| (బద్ధార్జునౌ) సిత | సితః॥త్రి॥ఇది,బద్ధే=కట్టఁబడినదానికిని, అర్జునే= |

(యుక్తే తు సంస్కృతేఽమర్షి) ణ్యభినీతో

అభినీతః ॥త్రి॥ ఇది, యుక్తే=యోగ్యమయిన దానికిని, సంస్కృతే=లెస్సగాఁ జేయఁబడినదానికిని, అమర్షిణి=కోపముగలవానికిని పేరు.

ఽథ సంస్కృతమ్.
౨౩౭. (కృత్రిమే లక్షణోపేతేఽప్య)

సంస్కృతమ్ ॥త్రి॥ఇది, కృత్రిమే=చేయఁబడిన ఘటాదులకును లక్షణోపేతే = వ్యాకరణలక్షణయుక్తమయినశబ్దములకును, అపిశబ్దమువలన లెస్సగాఁ జేయఁబడిన వస్తువునకును పేరు.

నన్తో(ఽనవధా వపి),

అనన్తః॥త్రి॥ఇది, అనవధౌ=అవధిలేనిదానికి పేరు. అపిశబ్దమువలన ఆదిశేషునికిని, విష్ణువునకును పేరయినపుడు ॥పు॥, ఆకాశమునకు పేరయినపుడు ॥న॥, భూమికి పేరయినపుడు ॥స్త్రీ॥.

(ఖ్యాతే హృష్టే) ప్రతీతోఽ

ప్రతీతః॥త్రి॥ఇది, ఖ్యాతే=పేరువడ్డవానికిని, హృష్టే=సంతోషించినవానికిని పేరు.

భిజాత (స్తు కులజే బుధే) ౨౩౮

అభిజాతః॥త్రి॥ఇది, కులజే= కులముగలవానికిని, బుధే=పండితునికిని పేరు.

వివిక్తౌ (పూతవిజనౌ)

వివిక్తః॥త్రి॥ఇది, పూతే=పవిత్రమైనదానికిని, విజనే=ఏకాంతస్థలమునకును పేరు.

మూర్ఛితౌ (మూఢసోచ్ఛ్రియౌ),

మూర్ఛితః॥త్రి॥ ఇది మూఢే=మూర్ఛపోయినదానికిని, సోచ్ఛ్రయే=వృద్ధిఁబొందినవానికిని పేరు.

(ద్వే చామ్లపరుషే) శుక్తే

శుక్తమ్॥త్రి॥ఇది, ఆమ్లే=ఆమ్లవిశేషమునకును, పరుషే=నిష్ఠురమయినదానికిని పేరు. ఆమ్లవిశేషమనఁగా మంటికుండ మొదలయినదానియందు తేనె బెల్లము కలిపి ఈమూఁడునుగూర్చి ధాన్యరాశియందు మూఁడురాత్రులు పెట్టినపులుసు.

శితీ (ధవళ మేచకౌ).

శితిః॥త్రి॥ఇది, ధవళే = తెల్లనిదానికి, మేచకే=నల్లనిదానికిని పేరు.

౨౩౯ (సత్యే సాధౌ విద్యమానే ప్రశస్తే ఽభ్యర్హితే చ) సత్,

సత్ ॥త్రి॥ఇది,సత్యే=సత్యమునకును, సాధౌ=సాధువునకును, విద్యమానే=కలిగియున్నదానికిని, ప్రశస్తే=శ్రేష్ఠమయినదానికిని, అభ్యర్హితే

పూజ్యమయినదానికిని పేరు.

పురస్కృతః (పూజితే ఽరాత్యభియుక్తేఽగ్రతః కృతే). ౨౮౦

పురస్కృతః ॥త్రి॥ ఇది, పూజితే=పూజ్యునికిని, అరాతి=శత్రువుచేత, అభియుక్తే=ఆక్రమింపఁబడ్డవానికిని, అగ్రతః=ముందుగా, కృతే=చేయఁబడినదానికిని పేరు.

నివాతా (వాశ్రయావాతే శస్త్రాభేద్యం చ వర్మ యత్),

నివాతః ॥త్రి॥ఇది, ఆశ్రయ=ఉండుస్థలమునకును, అవాతే = గాలిలేనిచోటికిని, శస్త్రైః=శస్త్రములచేత, అభేద్యమ్=భేదింపరాని, వర్మ=జోడునకును పేరు.

(జాతోన్నతప్రవృద్ధాస్స్యు)రుచ్ఛ్రితా

ఉచ్ఛ్రితః॥త్రి॥ఇది, జాత=పుట్టినదానికిని, ఉన్నత=పొడవైనవస్తువులకును, ప్రవృద్ధాః = బహుళమయినదానికిని పేరు.

ఉత్థితాస్త్వమీ. ౨౮౧. (వృద్ధిమత్ప్రోద్యతోత్పన్నా)

ఉత్థితః॥త్రి॥ఇది, వృద్ధిమత్ = వృద్ధిఁబొందినదానికిని, ప్రోద్యత=ఉద్యోగముగలవానికిని, ఉత్పన్నాః=పుట్టినవానికిని పేరు.

ఆదృతౌ (సాదరార్చితౌ),

ఆదృతః॥త్రి॥ఇది, సాదర=ఆదరించువానికిని, అర్చితౌ=పూజింపఁబడినవానికిని పేరు.

ఇతి తాన్తాః

త యనునక్షరము తుదను గలనానార్థకశబ్దములు ముగిసెను.

అర్థో (ఽభిధేయ రై వస్తు ప్రయోజన నివృత్తిషు). ౨౮౨

అర్థః॥పు॥ఇది, అభిధేయ=శబ్దమునకు వాచ్యమయినదానికిని, రై=ధనమునకును, వస్తు=వస్తువునకును, ప్రయోజన = ప్రయోజనమునకును, నివృత్తిషు=నివర్తించుటకును పేరు.

(నిపానాఽఽగమయోః) తీర్థ (మృషిజుష్టజలే గురౌ),

తీర్థమ్॥న॥ ఇది, నిపాన = నూతియొద్దినీళ్లతొట్టికిని, ఆగమయోః=శాస్త్రమునకును, ఋషిజుష్టజలే=ఋషులచేతసేవింపఁబడిన జలాశయమునకును, గురౌ=గురువునకును, రేవునకును పేరు. "నిదానాగమయోః" అనిపాఠాంతరము.

సమర్థ (స్త్రిషు శక్తిష్ఠ

సమర్థః॥త్రి॥ఇది, శక్తిష్ఠ=మిక్కిలిశక్తిగలవాని

సంబద్ధార్థే హితేఽపి
చ). ౨౮౩
దశమీస్థౌ (క్షీణరా
గ వృద్ధౌ)
వీథీ (పదవ్యపి),
(ఆస్థానీ యత్నయో
రాస్థా
ప్రస్థోఽ (స్త్రీ సాను
మానయోః). ౨౮౪

ఇతి థాన్తాః

(అభిప్రాయవశౌ) ఛ
న్దౌ
అబ్దౌ (జీమూత వత్స
రౌ),
అపవాదౌ (తు నిన్దాజ్ఞే)
దాయాదౌ (సుతబా
న్ధవౌ). ౨౮౫

పాదా (రశ్మ్యఙ్ఘ్రితు
ర్యాంశాః)
(శ్చన్ద్రాగ్న్యర్కాః)
స్తమోనుదః,
నిర్వాదో (జనవాదే
ఽపి)
శాదో(జమ్బాల శష్ప
యోః). ౨౮౬
(సారావే రుదితే త్రా
తే) ఆక్రన్దో (దారుణే

కిని, సంబద్ధార్థే=అన్వయ యోగ్యమయిన…
ముగలదానికిని, హితే-హితమైనదానికిని…
దశమీస్థః॥పు॥ఇది, క్షీణరాగ = నష్టవీర్యు…
వృద్ధౌ=వృద్ధునికిని పేరు. [మువలనవం…

వీథీ॥స్త్రీ॥ఇది, పదవీ=మార్గమునకును, ఆళి…

ఆస్థా॥స్త్రీ॥ఇది,ఆస్థానీ=ఆస్థానమునకు, యత్న…
యోః=యత్నమునకును పేరు.

ప్రస్థః॥పు॥ఇది,సాను=కొండనెత్తమునకు…
మానయోః=కుంచమునకును పేరు.

థ యను నక్షరము తుదను గలనానార్థ
శబ్దములు ముగిసెను.

ఛన్దః॥పు॥ఇది, అభిప్రాయ = అభిప్రాయమున…
కును, వశౌ=అధీనునికిని పేరు.

అబ్దః॥పు॥ ఇది, జీమూత=మేఘమునకును…
వత్సరౌ=సంవత్సరమునకును పేరు. [కును పే…

అపవాదః॥పు॥ఇది,నిన్దా =నిందకును,ఆజ్ఞ…

దాయాదః॥పు॥ఇది, సుత = కొడుకునకును…
బాన్ధవౌ=జ్ఞాతికిని పేరు. Kinsman

పాదః॥పు॥ఇది,రశ్మి=కిరణమునకును, అఙ్ఘ్రి…
కాలికిని, తుర్యాంశః=నాలవపాలికిని పేరు.

తమోనుత్॥ద్-పు॥ఇది, చన్ద్ర=చంద్రుని…
అగ్ని=అగ్నికిని,అర్కాః=సూర్యునికిని పేరు.

నిర్వాదః॥పు॥ఇది, జనవాదే=నిందకును, …
శబ్దమువలన నిశ్చితమయిన వాదమునకును, …
దు లేకుండుటకును పేరు.

శాదః॥పు॥ఇది, జమ్బాల=అడుసునకును,
ష్పయోః=లేతకసవునకును పేరు.

ఆక్రన్దః॥పు॥ఇది, సారావే=ఆర్తధ్వనితో…
డిస, రుదితే = రోదనమునకును, త్రాతే…

రణే),

చువానికిని, దారుణే=భయంకరమయిన, రణే=యుద్ధమునకును పేరు.

(స్యా)త్ప్రసాదో (ఽనురోధేఽపి)

ప్రసాదః॥పు॥ఇది, అనురోధే=అనుసరించుటకును, అపిశబ్దమువలన నైర్మల్యమునకును, ప్రీతికిని, కావ్యగుణవిశేషమునకును పేరు.

సూద (స్స్యా ద్వ్యఞ్జనేఽపిచ). ౨౪౭

సూదః॥పు॥ఇది, వ్యఞ్జనే=పప్పు మొదలైనవ్యంజనములకును, అపిశబ్దము చేతవండెడువానికిని పేరు.

(గోష్ఠాధ్యక్షేఽపి) గోవిన్దో

గోవిన్దః॥పు॥ఇది, గోష్ఠాధ్యక్షే=ఆవులనేలు వానికిని, అపిశబ్దమువలన విష్ణువునకును, బృహస్పతికిని పేరు.

(హర్షేఽప్యామోద వన్మదః,

ఆమోదః=మదః॥పు॥ ఈ రెండును, హర్షేఽపి=సంతోషమునకు పేళ్ళు. అపిశబ్దమువలనఆమోదశబ్దము పరిమళమునకు, మదశబ్దముగర్వమునకును పేరు.

(ప్రాధాన్యే రాజలిఙ్గేచ వృషాఙ్గే)కకుదో (ఽస్త్రియామ్). ౨౪౮

కకుదః॥పు॥(ప)కకుత్ ॥ద్-సీ॥ఇది,ప్రాధాన్యే=ప్రధానమైనదానికిని, రాజలిఙ్గేచ=రాజచిహ్నమునకును,వృషాఙ్గే=ఎద్దు మూఁపురమునకును పేరు.

స్త్రీసంవి (జ్జ్ఞానసంభాషా క్రియాకారాఽజినామసు),

సంవిత్ ॥ద్-సీ॥ఇది, జ్ఞాన=జ్ఞానమునకును,సంభాషా=సంకేతమునకును (ప) సంభాషణమునకును, క్రియాకార=నిశ్చయమునకును, ఆజి=యుద్ధమునకును, నామసు=నామధేయమునకును పేరు.

(ధర్మే రహ).స్యుపనిష

ఉపనిషత్ ॥ద్-సీ॥ఇది, ధర్మే=ధర్మమునకును, రహసి=రహస్యమునకును పేరు.

(త్స్యా దృతౌ వత్సరే) శరత్. ౨౪౯

శరత్ ॥ద్-సీ॥ఇది,ఋతౌ = శరదృతువునకును, వత్సరే=సంవత్సరమునకును పేరు. Year

పదం(వ్యవసిత త్రాణ స్థాన లక్ష్మాఙ్ఘ్రి వస్తుషు),

పదమ్॥న॥ఇది, వ్యవసిత=ఉద్యోగమునకును, త్రాణ=రక్షించుటకును, స్థాన=స్థానమునకును, లక్ష్మ=అడియాలమునకును, అఙ్ఘ్రి = అడుగునకును, వస్తుషు=వస్తువునకును పేరు.

గోష్పదం (సేవితే

గోష్పదమ్॥న॥ఇది, సేవితే=ఆవులు తిరుగు

మానే)

ప్రదేశమునకును, మానే=ఆవులగోరిజదిగ్గ...
నగుంటకును పేరు.

(ప్రతిష్ఠాకృత్యే) మాస్పదమ్. ౨౧౦

ఆస్పదమ్॥న॥ఇది, ప్రతిష్ఠా=స్థానమునకును, కృత్యమ్=చేయఁదగినదానికిని పేరు.

(త్రిష్విష్ట మధురౌ) స్వాదూ

స్వాదు॥త్రి॥ఇది, ఇష్ట=ఇష్టమయినదా..., మధురౌ=మధురమయినదానికిని పేరు.

మృదూ (చాతీక్ష్ణ కోమలౌ),

మృదుః ॥త్రి॥ ఇది, అతీక్ష్ణ=కూ[ర]ము కా... దానికిని, కోమలౌ=మెత్తనిదానికిని పేరు.

(మూ ఢా ల్పాపటునిర్భాగ్యా) మన్దా (స్సు శ్రీ)

మన్దః॥త్రి॥ఇది, మూఢ=మూఢునికిని, అల్ప... అల్పమయినదానికిని, అపటు=సమర్థుఁడు కా... వానికిని, నిర్భాగ్యాః=నిర్భాగ్యునికిని పేరు.

(ద్వౌ తు) శారదా.
(ప్రత్య గ్రాప్రతిభౌ)

శారదః॥త్రి॥ఇది, ప్రత్యగ్ర=నూతనము... వానికిని, అప్రతిభౌ=సమర్థుఁడు కానివానికిని...

(విద్వ త్సుప్రగల్భౌ) విశారదౌ,

విశారదః॥త్రి॥ఇది, విద్వత్=విద్వాంసు... సుప్రగల్భౌ=ప్రౌఢునికిని పేరు.

ఇతి దాన్తాః.

ద యనునక్షరము తుదనుగలనానార్థ శబ్దములు ముగిసెను.

(వ్యామోవటశ్చ) న్యగ్రోధౌ

న్యగ్రోధః ॥పు॥ ఇది, వ్యామః=బారకును, వటశ్చ=మఱ్ఱిచెట్టునకును పేరు. Banian Tr...

ఉత్సేధః (కాయఉన్నతిః). ౨౧౨

ఉత్సేధః॥పు॥ఇది, కాయే = శరీరము... ఉన్నతిః=పొడవునకును పేరు.

(పర్యాహారశ్చ మార్గశ్చ) వివధౌ వీవధౌ చ తౌ.

వివధః-వీవధః॥పు॥ ఈ రెండు, పర్యాహా... వర్తకుఁడు దేశాంతరమునుండి తెచ్చివిక్రయ... నమందునిచిన వస్తువులకును(వ) కావడికిని, ... ర్గశ్చ=మార్గమునకును పేళ్లు.

పరిధి (ర్యజ్ఞియతరోః శాఖాయా ముపనూర్యకే). ౨౧౩

పరిధిః॥పు॥ఇది, యజ్ఞియతరోః=యజ్ఞార్హ... డి చెట్టుమొదలైనదానియొక్క, శాఖాయాః... కొమ్మకును, ఉపసూర్యకే=పరివేషమునకును...

బన్ధకం వ్యసనం చే

ఆధిః॥పు॥ఇది, బన్ధకమ్=తేత్రాదులు...

(చే)తఃపీడాఽధిష్ఠాన) మాధయః,

పెట్టుటకును, వ్యసనమ్=జూదము మొదలయిన వ్యసనమునకును, చేతఃపీడా=మనోదుఃఖమునకును, అధిష్ఠానమ్=ఆశ్రయించుటకును పేరు.

(స్యా త్సమర్థన నీవాక నియమాశ్చ) సమాధయః. ౨౪౮

సమాధిః॥పు॥ఇది, సమర్థన = శంకాపరిహారమునకును, నీవాక=మాట్లాడకుండుటకును [వ] అగ్గువైనధాన్యములయందు జనులయాదరమునకును,నియమ = వ్రతోపవాసాదులకును[వ] అంగీకారమునకును, చకారమువలన చిత్తైకాగ్ర్యమునకును, ప్రకారమునకును పేరు.

(దోషోత్పాదే) ఽనుబన్ధ(స్స్యా త్ప్ర)కృత్యాదిషు నశ్వరే, ముఖ్యానుయాయిని శిశౌ ప్రకృత స్యానువర్తనే). ౨౪౯

అనుబన్ధః॥పు॥ఇది, దోషోత్పాదే=దోషోత్పాదనమునకును, ప్రకృత్యాదిషు = ప్రకృతిప్రత్యయాదులయందు, నశ్వరే = నశించిపోవునక్షరమునకును, ముఖ్య=ముఖ్యులయినతండ్రిమొదలైనవారిని, అనుయాయిని=అనుసరించిపోవు, శిశౌ = శిశువునకును, ప్రకృతస్యఅనువర్తనే=ప్రకృతమయినదిమెడతెగక యనువర్తించుటకును పేరు. ముఖ్యులయినవారికిని, అనుసరించినవారికిని, శిశువునకును పేరని కొందఱు.

విధు (ర్విష్ణౌ చన్ద్రమసి)

విధుః॥పు॥ఇది, విష్ణౌ=విష్ణువునకును, చన్ద్రమసి=చంద్రునికిని పేరు.

(పరిచ్ఛేదే బలే)ఽవధిః,

అవధిః॥పు॥ఇది,పరిచ్ఛేదే = మర్యాదకును, బలే= [బలమునకును పేరు.

విధి (ర్విధానే దైవేఽపి)

విధిః॥పు॥ఇది,విధానే=చేయుటకును దైవే=దైవమునకును,అపిశబ్దమువలన బ్రహ్మదేవునికిని, ప్రకారమునకును, విధాయకవాక్యమునకును పేరు,

ప్రణిధిః (ప్రార్థనే చరే). ౨౫౦

ప్రణిధిః॥పు॥ఇది, ప్రార్థనే = ప్రార్థనకును, చరే= వేగులవానికిని పేరు. Spy.

బుద్ధవృద్ధౌ (పణ్డితేఽపి).

బుద్ధః॥పు॥-వృద్ధః॥త్రి॥ ఈ రెండును, పణ్డితే = విద్వాంసునికిని పేళ్లు. అపిశబ్దమువలనవరుసగాబుద్ధదేవునకును, ముసలివానికిని పేళ్లు. Old-man.

స్కన్ధ (స్సముదయేఽపిచ), | స్కన్ధః॥పు॥ఇది, సముదయే = అధ్యాయ సమూహమునకును, అపిశబ్దమువలన మూ కును,చెట్టు మొదటికిని, బౌద్ధశాస్త్రోక్తమైన పవేదనా విజ్ఞాన సంజ్ఞాసంస్కారము లను స్కంధములకును పేరు.

(దేశే నదవిశేషేఽబ్ధౌ)సిన్ధు (ర్నాసరితి స్త్రియామ్). | సిన్ధుః॥ఇది, దేశే = దేశవిశేషమునకును, విశేషే=నదవిశేషమునకును, అబ్ధౌ = సము మునకును పేరయినపుడు॥పు॥, సరితి=సామా ముగా నదికి పేరయినపుడు॥స్త్రీ॥.

విధా (విధౌ ప్రకారేచ) | విధా॥స్త్రీ॥[ప]॥పు॥ఇది, విధౌ=చేయుట ప్రకారే = ప్రకారమునకును, చకారము గజాన్నమునకును, కూలికిని పేరు.

సాధూ (రమ్యేఽపిచ త్రిషు), | సాధుః॥త్రి॥ఇది, రమ్యేఽపిచ=ఒప్పిదము వస్తువునకును, అపిశబ్దమువలన సజ్జనునికిని పే

వధూ (ర్జాయా) స్నుషా స్త్రీచ) | వధూః॥స్త్రీ॥ఇది, జాయా = పెండ్లామున స్నుషా=కోడలికిని, స్త్రీ= స్త్రీమాత్రమున చకారమువలన స్పృక్కయనుగంధద్రవ్య మునకును పేరు.

సుధా(లేపోఽమృతం స్నుహీ), | సుధా॥స్త్రీ॥ఇది, లేప=సున్నముపూయుట అమృతమ్ = అమృతమునకును, స్నుహీ=జె డుచెట్టునకును పేరు.

సన్ధా(ప్రతిజ్ఞా మర్యాదా) | సన్ధా॥స్త్రీ॥ఇది, ప్రతిజ్ఞా = ప్రతిజ్ఞకును, మర్యా దా=మర్యాదకును పేరు.

శ్రద్ధా (సమ్ప్రత్యయః స్పృహా), | శ్రద్ధా॥స్త్రీ॥ఇది, సమ్ప్రత్యయః=భక్త్యాతిశ మునకును, స్పృహా=ఇచ్ఛకును పేరు.

మధు (మద్యే పుష్పరసే క్షౌద్రేఽప్య) | మధు॥ఇది,మద్యే=మద్యమునకును,పుష్ప పూఁదేనెకును,క్షౌద్రే = తేనెకును పేరైనపుడు అపిశబ్దమువలనచైత్రమాసమునకును, మధు రాక్షసునికిని, ఇప్పచెట్టునకును పేరైనపుడు

న్ధం (తమస్యపి).

అన్ధమ్॥ఇది,తమసి=చీఁకటికి పేరైనపుడు॥న॥ అపిశబ్దమువలన గ్రుడ్డివానికిని పేరైనపుడు॥త్రి॥.

(అథ త్రిషు)

ముందుఁ జెప్పఁగల ధాంతశబ్దములు॥త్రి॥.

సమున్నద్ధౌ (పణ్డితం మన్యగర్వితౌ),

సమున్నద్ధః॥త్రి॥ ఇది, పణ్డితంమన్య = పండితుఁడు గాక యే తానుపండితుఁ డనుకొనువానికిని, గర్వితౌ=గర్వము గలవానికిని పేరు.

బ్రహ్మబన్ధు (రధిక్షేప్తే నిర్దేశే)

బ్రహ్మబన్ధుః త్రి॥ ఇది, అధిక్షేప్తే=బ్రాహ్మణకర్మహీనుఁ డైనబ్రాహ్మణునికిని, నిర్దేశే = ద్వేషముచేత పేర్కొనంబడినవానికిని పేరు.

(ఽథావలమ్బితే. ఽదూరే అవిదూరే) ఽప్యవష్టబ్ధః

అవష్టబ్ధః॥త్రి॥ఇది, అవలమ్బితే=అవలంబింపఁబడినవానికిని, అవిదూరే = దగ్గఱనున్నదానికిని, అపిశబ్దమువలన కట్టఁబడినదానికిని పేరు.

ప్రసిద్ధౌ (ఖ్యాత భూషితౌ),

ప్రసిద్ధః॥త్రి॥ఇది, ఖ్యాత=ఖ్యాతిగలవానికిని, భూషితౌ=అలంకరింపఁబడిన దానికిని పేరు.

ఇతి ధాన్తాః.

ధ యనునక్షరము తుదను గలనానార్థక శబ్దములు ముగిసెను.

(సూర్యవహ్నీ) చిత్రభానూ

చిత్రభానుః॥పు॥ఇది, సూర్య = సూర్యునికిని, వహ్నీ=అగ్నికిని పేరు. [రౌ = సూర్యునికిని పేరు.

భానూ (రశ్మిదివాకరౌ).

భానుః॥పు॥ఇది,రశ్మి=కిరణములకును, దివాక

భూతాత్మానౌ (ధాతృదేహౌ)

భూతాత్మా॥న్-పు॥ఇది, ధాతృ=బ్రహ్మకును, దేహౌ=దేహమునకును పేరు.

(మూర్ఖనీచౌ) పృథగ్జనౌ,

పృథగ్జనః॥పు॥ఇది, మూర్ఖ=మూర్ఖునికిని, నీచౌ=హీనజాతివానికిని పేరు.

గ్రావాణౌ (శైలపాషాణౌ)

గ్రావా॥న్-పు॥ఇది, శైల = పర్వతమునకును, పాషాణౌ=రాతికిని పేరు. [ణౌ=పక్షికిని పేరు.

పత్త్రిణౌ (శరపక్షిణౌ).

పత్త్రీ॥న్॥ఇది, శర = బాణమునకును, పక్షి

(తరుశైలౌ) శిఖరిణౌ

శిఖరీ॥న్-పు॥ఇది, తరు = వృక్షమునకును, శైలౌ=పర్వతమునకును పేరు [నెమిలికిని పేరు.

శిఖినౌ(వహ్నిబర్హిణౌ),

శిఖీ॥న్-పు॥ఇది,వహ్ని=అగ్నికిని, బర్హిణౌ=

ప్రతియత్నో (వుభౌ లిప్సోపగ్రహౌ)

ప్రతియత్నః॥పు॥ఇది, లిప్సా=అభిలాషకును, ఉపగ్రహః = చెఱపట్టుటకును, స్వభావము గలిగియున్న వస్తువునకును, గుణోత్కర్షచేయుటకును పేరు.

వథ సాదినౌ. (ద్వౌ సారథిహయారోహౌ)

సాదీ॥న్-పు॥ఇది, సారథి=సారథికిని, హయారోహః=గుఱ్ఱపు రౌతునకును పేరు.

వాజినోஉ(శ్వేషు పక్షిణః),

వాజీ॥న్-పు॥ఇది, అశ్వ=గుఱ్ఱమునకును, ఇషు=బాణమునకును, పక్షిణః = పక్షికిని పేరు

(కులేஉ)ప్యభిజనో (జన్మభూమా వప్య)

అభిజనః॥పు॥ఇది, కులే=కులమునకును, జన్మభూమౌ=జన్మభూమికిని, అపిశబ్దమువలనకీర్తి కులాగతమయిన ధ్వజాదులకును పేరు.

థ హాయనాః. ౨౯౮ (వర్షార్చి ర్వ్రీహిభేదా స్స్యుః)

హాయనః॥పు॥ ఇది, వర్ష=సంవత్సరమునకును, అర్చిః=కిరణమునకును, వ్రీహిభేదాః = ధాన్యవిశేషమునకును పేరు.

(శ్చన్ద్రాగ్న్యర్కా) విరోచనాః,

విరోచనః॥పు॥ఇది, చన్ద్రి=చంద్రునికిని, అగ్ని=అగ్నికిని, అర్కః=సూర్యునికిని పేరు.

(కేశేஉపి) వృజినో

వృజినః॥ఇది, కేశే=వెండ్రుకలకు పేరైనపుడు ॥త్రి॥, అపిశబ్దమువలన పాపమునకు పేరైనపుడు ॥న॥, క్లేశమునకు పేరైనపుడు॥పు॥.

విశ్వకర్మా (ర్క సురశిల్పినోః) ౨౯౯

విశ్వకర్మా॥న్-పు॥ ఇది, అర్క = సూర్యునికిని, సురశిల్పినోః= దేవశిల్పికిని పేరు.

ఆత్మా (యత్నో ధృతి ర్బుద్ధి స్స్వభావో బ్రహ్మవర్ష్మ చ),

ఆత్మా॥న్-పు॥ఇది, యత్నః=యత్నమునకును, ధృతిః=ధైర్యమునకును, బుద్ధిః=బుద్ధికిని, స్వభావః= స్వభావమునకును, బ్రహ్మ=పరాత్మకును, వర్ష్మ= దేహమునకును, చకారమువలన జీవునికిని పేరు.

(శక్ర ఘాతుక మత్తేభ వర్షుకాబ్దా) ఘనాఘనాః. ౨౯౯

ఘనాఘనః॥ఇది, శక్ర = దేవేంద్రునికిని, ఘాతుక= చంపుస్వభావముగల, మత్తేభ =మదపు టేనుగునకును, వర్షుకాబ్దాః=వర్షించుమేఘమునకును పేరు.

అభిమానో (ఽర్థాది

అభిమానః॥పు॥ఇది, అర్థాది = ధనాదుల

దర్పేఽజ్ఞానే ప్రణయ హింసయోః),

వచ్చిన, దర్పే=గర్వమునకును, అజ్ఞానే=అజ్ఞానమునకును, ప్రణయ=ప్రార్థనకును, హింసయోః=హింసకును పేరు.

ఘనో (మేఘే మూర్తిగుణే త్రిషు మూర్తే నిర న్తరే). ౨౬౭

ఘనః॥పు॥ఇది, మేఘు=మేఘము.నకును, మూర్తిగుణే=కాఠిన్యమునకును పేరు. మూర్తే = కఠినమైనవస్తువునకును, నిరన్తరే = దట్టమైనవస్తువునకును పేరైనపుడు ॥త్రి॥ ఈఘనశబ్దము లోహముద్గర ముస్తాకాంస్యతాళాదులకును పేరు.

ఇన (స్సూర్యే ప్రభౌ)

ఇనః॥పు॥ఇది, సూర్యే=సూర్యునికిని, ప్రభౌ=ప్రభువునకును పేరు.

రాజా (మృగాఙ్కే క్షత్రియే నృపే),

రాజా॥న్-పు॥ఇది, మృగాఙ్కే=చంద్రునికిని, క్షత్రియే = క్షత్రియజాతివానికిని, నృపే=భూమినేలువానికిని పేరు. ప్రభువునకుననికొందఱు.

వాణిన్యౌ (నర్తకీదూత్యౌ)

వాణినీ॥స్త్రీ॥ ఇది, నర్తకీ = నాట్యమాడుస్త్రీకిని,దూత్యౌ=దూతికిని పేరు. ఇచట "మత్తావిదగ్ధేవాణిన్యౌ" అని పాఠము గలదు.

(స్రవన్త్యా మపి) వాహినీ. ౨౬౮

వాహినీ॥స్త్రీ॥ఇది, స్రవన్త్యామ్=నదికిని, అపిశబ్దమువలన సేనావిశేషమునకును పేరు.

హ్రాదిన్యౌ (వజ్రతటితౌ)

హ్రాదినీ॥స్త్రీ॥ ఇది, వజ్ర = వజ్రాయుధమునకును, తటితౌ = మెఱుపునకును పేరు.

(వన్దాయామపి) కామినీ,

కామినీ॥స్త్రీ॥ఇది, వన్దాయామ్=బదనికకును, అపిశబ్దమువలన విలాసినియైనస్త్రీకిని పేరు.

(త్వగ్దేహయోరపి) తను

తనుః॥స్త్రీ॥ఇది,త్వక్=తోలునకును, దేహయోః = దేహమునకును పేరు, అపిశబ్దమువలన సల్పమైనదానికిని, సన్నమైనదానికిని పేరైనపుడు॥త్రి॥.

స్సూనాఽ (ధోజిహ్వాకాఽపిచ). ౨౬౯

సూనా॥స్త్రీ॥ఇది, అధోజిహ్వకాఽపిచ = కొండనాలుకకును, అపిశబ్దమువలన వధస్థానమునకును పేరు.

(క్రతు విస్తారయో ర

వితానమ్॥న॥ఇది, క్రతౌ=యజ్ఞమునకును,విస్తా

స్త్రీ) వితానం త్రిషు
(తుచ్ఛకే, మన్దే)

అథ కేతనం (కృత్యే కే
తావుపనిమన్త్రణే) ౨౨౦

వేదస్తత్త్వం తపో)
బ్రహ్మ బ్రహ్మా(విప్రః ప్ర
జాపతిః),

(ఉత్పాదనేచ హింసా
యాం సూచనే చాపి)
గన్ధనమ్. ౨౨౧

ఆతఞ్చనం (ప్రతీవాపజ
వనాప్యాయనార్థకమ్),

వ్యఞ్జనం (లాఞ్ఛనేశ్మ
శ్రునిష్ఠానావయవే ష్వ
పి): ౨౨౨

(స్యా)త్కౌలీనం (లోక
వాదే యుద్ధే పశ్వహి

రయోః = విస్తారమునకును పేరయినపుడు ॥స్త్రీ॥ తుచ్ఛకే=రిత్తయయినదానికిని, మన్దే=మందునకిని పేరయినపుడు॥త్రి॥.

కేతనమ్॥న॥ఇది, కృత్యే = చేయఁదగినదానికిని, కేతౌ = టెక్కెమునకును, ఉపనిమన్త్రణే=బ్రాహ్మణుల నిమంత్రణముచేయుటకును పేరు

బ్రహ్మ॥న్॥ఇది, వేదః=వేదమునకును, తత్త్వమ్= పరమాత్మకును, తపః=తపస్సునకును పేరయినపుడు॥న॥, విప్రః = బ్రాహ్మణునికిని, ప్రజాపతిః=బ్రహ్మదేవునికిని పేరైనపుడు॥పు॥.

గన్ధనమ్॥న॥ఇది, ఉత్పాదనేచ = నలుగు పెట్టుటకును, హింసాయామ్=హింసించుటకును, సూచనేచ=ఎఱిఁగించుటకును పేరు. "ఉత్సాహనేచ హింసాయై" అనుపాఠమునఉత్సాహమునకును హింసించుటకై కొండెముచెప్పుటకును, అపిశబ్దమువలన ప్రకాశమునకును పేరు.

ఆతఞ్చనమ్॥న॥ఇది, ప్రతీవాప=ప్రతీవాపమునకును, జవన=వేగమునకును, ఆప్యాయనార్థకమ్=తృప్తిజేయుటకును పేరు. ప్రతీవాపమనఁ గరఁగిన బంగారు మొదలయినదానిని ద్రవ్యాంతరముతోఁగూర్చి పొడిచేయుట, పాలుతోడుపెట్టుట యనికొందఱు.

వ్యఞ్జనమ్॥న॥ఇది, లాఞ్ఛనే=గుఱుతునకును, శ్మశ్రునిష్ఠానావయవేషు= గడ్డమునీసాలకును తిమ్మనమునకును, స్త్రీపురుషులగుహ్యావయవములకును,అపిశబ్దమువలన కకారాదివర్ణములకును పేరు.

కౌలీనమ్॥న॥ఇది, లోకవాదే=లోకాపవాదమునకును, పశ్వహిపక్షిణామ్ = పశుసర్పదశుల

పక్షిణామ్), | యొక్క, యుద్ధే=యుద్ధమునకును పేరు.

(స్యా)దుద్యానం (నిస్సరణే వనభేదే ప్రయోజనే). ౨౨౩

ఉద్యానమ్॥న॥ ఇది, నిస్సరణే = గృహాదుల నుండి వెడలుటకును, వనభేదే = శృంగారపుతోఁటకును, ప్రయోజనే = ప్రయోజనమునకును పేరు.

(అవకాశేస్థితౌ) స్థానం

స్థానమ్॥న॥ ఇది, అవకాశే=తావునకును, స్థితౌ=ఉనికికిని పేరు.

(క్రీడాదావపి) దేవనమ్,

దేవనమ్॥న॥ఇది, క్రీడాదౌ=క్రీడకును,ఆదిశబ్దమువలన విజిగీషావ్యవహారద్యుతిస్తుతిమోదమదస్వప్నకాంతి గతులకును. అపిశబ్దమువలన విలాపమునకును, జూదమునకును పేరు.

ఉత్థానం (పౌరుషే తన్త్రే సన్నివిష్టోద్గమేఽపిచ). ౨౨౪

ఉత్థానమ్॥న॥ఇది, పౌరుషే=పురుషప్రమాణమునకును, తన్త్రే=సైన్యమునకును, సన్నివిష్టోద్గమే=కూర్చున్నవాఁడు లేచుటకును, అపిశబ్దమువలన మలోత్సర్గమునకును, హర్షమునకును, ఉద్యోగమునకును, సమాప్తికిని పేరు.

వ్యుత్థానం (ప్రతిరోధే చ విరోధాచరణేఽపిచ),

వ్యుత్థానమ్॥ ఇది, ప్రతిరోధే=అడ్డపెట్టుటకును, విరోధాచరణే = ప్రతికూలముచేయుటకును,అపిశబ్దమువలన సమాధిమానుటకును పేరు.

(మారణేమృతసంస్కారే గతౌ ద్రవ్యేఽర్థదాపనే. ౨౨౫. నిర్వర్తనోపకరణానువ్రజ్యాసుచ) సాధనమ్,

సాధనమ్॥న॥ఇది,మారణే=చంపుటకును, మృతసంస్కారే=మృతునిసంస్కరించుటకును [వ] వసనాభిమొదలయినదానివిషము పోఁగొట్టుటకును, గతౌ=గమనమునకును, ద్రవ్యే = ధనమునకును, అర్థదాపనే = అప్పుపుచ్చుకొన్నయర్థము నిప్పించుటకును, నిర్వర్తన=ముగుడుటకును, ఉపకరణ=ఉపాయమునకును,అనువ్రజ్యా=వెంటఁబోవుటకును; చకారమువలన లింగమునకును,కరణమునకును,సైన్యమునకును, మేఢ్రమునకును పేరు.

నిర్యాతనం (వైరశుద్ధౌ దానే న్యాసార్పణే

నిర్యాతనమ్॥న॥ఇది, వైరశుద్ధౌ=పగసాధించుటకును, దానే=దానమునకును, న్యాసార్పణే=

| | |
|---|---|
| ఉపిచ). | దాఁచఁ బెట్టినవి తిరుగనిచ్చుటకును, అపిశబ్ద వలన అప్పుదీయుటకును పేరు. |
| వ్యసనం (విపది భ్రం శే దోషే కామజకోపజే), | వ్యసనమ్॥న॥ ఇది, విపది=ఆపదకును, భ్రంశే=పడుటకును, కామజకోపజేదోషే = కామక్రోధములవలనఁబుట్టిన స్త్రీద్యూతాదిస వ్యసనములకును పేరు. |
| పక్ష్మ (అక్షిలోమ్ని కిఞ్జల్కే తన్త్వాద్యంశే ఽప్యణీయసి). 122 | పక్ష్మ॥న్-న॥ఇది,అక్షిలోమ్ని=ఱెప్పవెండ్రుకలకును,కిఞ్జల్కే=ఆకరుపువ్వులకును, తన్త్వాద్యంశే =సూక్ష్మమైన నూలు మొదలైనదానితునుకలకును, అపిశబ్దమువలనపక్షులతుప్పాడునకును పేరు. |
| (తిథిభేదే క్షణే పర్వ | పర్వ॥న్॥ ఇది,తిథిభేదే=పున్నమ మొదలయిన పర్వతిథులకును, క్షణే = ఉత్సవమునకును పేరు. ఇదిగాక పున్నమపాడ్యమిసంధికిని, కణుపునకును,ప్రస్తావమునకును పేరు. |
| వర్త్మ (నేత్రచ్ఛదేఽధ్వని), | వర్త్మ॥న్-న॥ఇది, నేత్రచ్ఛదే = ఱెప్పకును, అధ్వని= తెరువునకును పేరు. |
| (అకార్యగుహ్యే) కౌపీనే | కౌపీనమ్॥న॥ఇది,అకార్య = చేయరానిపనికిని, గుహ్యే=గుహ్యమునకును [ప] గోఁచికిని పేరు. |
| మైథునం (సఙ్గతే రతౌ). 123 | మైథునమ్॥న॥ ఇది, సఙ్గతే=సంబంధమునకును, రతౌ=సురతమునకును పేరు. |
| ప్రధానం (పరమాత్మా చ) | ప్రధానమ్॥న॥ఇది, పరమాత్మా = పరమాత్మకు పేరు. చకారమువలనప్రకృతికిని, ప్రధానమునకును ముఖ్యునికిని పేరు. |
| ప్రజ్ఞానం (బుద్ధిచిహ్నయోః), | ప్రజ్ఞానమ్॥న॥ ఇదిః బుద్ధి=బుద్ధికిని, చిహ్నయోః=గుఱుతునకును పేరు. |
| ప్రసూనం (పుష్పఫలయోః) | ప్రసూనమ్ ॥న॥ ఇది. పుష్ప=పుష్పమునకును, ఫలయోః=ఫలమునకును పేరు. |
| నిధనం (కులనాశయోః). 124 | నిధనమ్॥న॥ఇది, కుల=కులమునకును, నాశయోః=నాశమునకును పేరు. |

క్రన్దనే (రోదనాఽహ్వానే)

క్రన్దనమ్॥న॥ఇది, రోదన=ఏడ్పునకును, ఆహ్వానే=పిలుచుటకును పేరు. Calling.

వర్ష్మ (దేహ ప్రమాణయోః),

వర్ష్మ॥న్॥ఇది, దేహ=దేహమునకును, ప్రమాణయోః=కొలఁతకును పేరు.

(గృహ దేహత్విట్ప్రభావా) ధామాన్య

ధామ॥న్-న॥ఇది, గృహ=గృహమునకును, దేహ=దేహమునకును, త్విట్ = కాంతికిని, ప్రభావాః=ప్రభావమునకును పేరు.

(థ చతుష్పథే. ౨౮౦
సన్నివేశేచ) సంస్థానం

సంస్థానమ్॥న॥ఇది, చతుష్పథే=నాలుగు తెరువులుగూడినదిక్కునకును, సన్నివేశే = సన్నివేశమునకును, చకారమువలననాకృతికిని, మరణమునకును పేరు. సన్నివేశమనఁగా అనయవరచనావిశేషమనికొందఱు, ఊరుచుట్టునుండుబయలనికొందఱు.

లక్ష్మ(చిహ్న ప్రధానయోః),

లక్ష్మ॥న్-న॥ ఇది, చిహ్న = గుఱుతునకును, ప్రధానయోః=ప్రధానమునకును పేరు.

ఆచ్ఛాదనే (సంపిధానమపవారణ మిత్యుభే).

ఆచ్ఛాదనమ్॥న॥ఇది, సంపిధానమ్=వస్త్రమునకును, అపవారణమ్=కప్పుటకును పేరు.

ఆరాధనం(సాధనేప్యవాప్తౌ తోషణేఽపిచ),

ఆరాధనమ్॥న॥ఇది, సాధనే=సిద్ధించుటకును, అవాప్తౌ=ప్రాప్తికిని, తోషణే=సంతోషించుటకును పేరు.

అధిష్ఠానం (చక్రపురప్రభావాధ్యాసనే ష్వపి). ౨౮౧

అధిష్ఠానమ్॥న॥ఇది, చక్ర=బండికంటికిని, పుర=పట్టణమునకును, ప్రభావ=ప్రభావమునకును, అధ్యాసనేష్వపి=ఆక్రమించుటకునుపేరు.

రత్నం (స్వజాతిశ్రేష్ఠేఽపి)

రత్నమ్॥న॥ఇది, స్వజాతిశ్రేష్ఠే = స్వజాతిలో శ్రేష్ఠమయినదానికిని, అపిశబ్దమువలన వజ్రము మొదలైనమణులకునుపేరు. [నే=అడవికిపేరు.

వనే (సలిలకాననే),

వనమ్॥న॥ఇది, సలిల=ఉదకమునకును, కాన

తలినం (విరళే స్తోకే)

తలినమ్॥ త్రి॥ఇది, విరళే = పలుచనిదానికిని, స్తోకే = ఇంచుకంతకును పేరు. విరళమనఁగా

| | |
|---|---|
| | నిర్మలమనికొందఱు. |
| (వాచ్యలిఙ్గా స్తథో త్తరే). ౨౦౩ | ఉత్తరే=ముందుఁ జెప్పఁగలనాంతశబ్దములు తథా = ఆతలినశబ్దమువలె, వాచ్యలింగాః=వాచ్యలింగము గలవి. |
| సమానా (స్సత్సమైకే స్యుః) | సమానః॥త్రి॥ఇది, సత్=సజ్జనునికిని, సదృశమయినదానికిని, ఏకే=ఒక్కటైన వస్తువునకును పేరు. [కొండెగానికిని పే |
| పిశునా(ఖలసూచకౌ), | పిశునః॥త్రి॥ ఇది, ఖల=దుర్జనునికిని,సూచకః |
| హీనన్యూనా (వూనగర్హ్యౌ) | హీనః-న్యూనః॥త్రి॥ ఈ ౨ను, ఊన=తక్కువైనదానికిని, గర్హ్యౌ=నిందింపఁబడినదానికిని |
| (వేగిశూరౌ) తరస్వినౌ. ౨౦౪ | తరస్విన్-త్రి॥ఇది, వేగి = వేగముకలవానికిని, శూరౌ=బలవంతునికిని పేరు. |
| అభిపన్నో (ఽపరాద్ధోఽరిగ్రస్త వ్యాపద్గతావపి), | అభిపన్నః॥త్రి॥ఇది,అపరాద్ధః=అపరాధముచేసినవానికి, అరిగ్రస్త=శత్రువుల చేతఁబట్టుపడినవానికిని, వ్యాపద్గతావపి=ఆపదఁబొందినవానికిని పే |
| ⸺ ఇతి నాన్తాః. ⸺ | న యనునక్షరము తుదను గల నాన్తశబ్దములు ముగిసెను. |
| కలాపో (భూషణేబర్హే తూణీరే సంహతావపి). ౨౦౫ | కలాపః॥పు॥ఇది,భూషణే=తొడవునకును, బర్హే=నెమిలిపురికిని, తూణీరే = అమ్ములపొదికిని, సంహతావపి=సమూహమునకును పేరు. |
| (పరిచ్ఛదే) పరీవాపః (పర్యుప్తౌ సలిలస్థితౌ), | పరీవాపః॥పు॥ఇది, పరిచ్ఛదే=గుడారము మొదలైనవానికిని, పర్యుప్తౌ=వెద పెట్టుటకును, సలిలస్థితౌ=నీళ్లునిలుచుటకు [వ] నీళ్ల యునికిపట్టునకును పేరు. పరిచ్ఛదమనఁగా పరివారమనికొందఱు. |
| (గోధుగ్గోష్ఠపతీ) గోపౌ | గోపః॥పు॥ఇది, గోధుక్=గొల్లవానికిని, గోష్ఠపతీ=ఆవుల నేలువానికిని, [వ] రాజునకును అనేకగ్రామాధికారికిని పేరు. |
| (హరవిష్ణూ) వృషాకపీ. ౨౦౬ | వృషాకపిః॥పు॥ఇది, హర=శివునికిని, విష్ణువునకును [వ] అగ్నికిని, ఇంద్రునికిని పే |

బాష్ప (ఊష్మాశ్రు)

బాష్పః॥పు॥ఇది, ఊష్మ=ఆవిరికిని, అశ్రు=కన్నీళ్ళకును పేరు.

కశిపు (స్త్వన్న మాచ్ఛాదనం ద్వయమ్),

కశిపుః॥పు॥ ఇది, అన్నమ్=అన్నమునకును, ఆచ్ఛాదనమ్=వస్త్రమునకును, ఈ రెంటికినిఏకోక్తిచేతఁగాని ప్రత్యేకముగాఁగాని పేరు.

తల్పం (శయ్యాట్ట దారేషు)

తల్పమ్॥న॥ [ప]॥పు॥ఇది, శయ్యా=పాన్పునకును, అట్ట=అట్టళ్ళకును, దారేషు=పెండ్లామునకును పేరు. Wife.

(స్తమ్బేఽపి) విటపో ఽ(స్త్రియామ్) ౨౦౭
ప్రాప్తరూప సురూపాభిరూపా (బుధ మనోజ్ఞయోః, భేద్యలింగా అమీ)

విటపః॥పు॥ఇది, స్తమ్బే=కసవుగంటకును, అవిశబ్దమువలన చిగురునకును, కొమ్మకును పేరు.

ప్రాప్తరూపః - సురూపః-అభిరూపః ॥ ఈ 3ను, బుధ=విద్వాంసునికిని, మనోజ్ఞయోః=ఒప్పిడివానికిని పేరు. ఇవి విశేష్యలింగములు.

(కూర్మ్యా వీణాభేదేఽపి) కచ్ఛపీ. ౨౦౮

కచ్ఛపీ॥స్త్రీ॥ఇది, కూర్మ్యా=ఆఁడుతాఁబేటికిని, వీణాభేదే=సరస్వతివీణకును పేరు. Lute.

—— ఇతి పాన్తాః. ——

ప యనునక్షరము తుదనుగల నానార్థకశబ్దములు ముగిసెను.

[(రవర్ణే పుంసి) రేఫ (స్స్యాత్ కుత్సితే వాచ్యలిఙ్గకః)]

రేఫః॥ఇది, రవర్ణే=రవర్ణమునకు పేరైనపుడు ॥పు॥, కుత్సితే=కుత్సితునికిని పేరైనపుడు ॥త్రి॥ అధిక పాఠము.

ఇతి ఫాన్తాః.

ఫ యనునక్షరము తుదనుగల నానార్థకశబ్దము ముగిసెను.

(అన్తరాభవసత్త్వేఽశ్వే) గన్ధర్వో (దివ్యగాయనే),

గన్ధర్వః॥పు॥ఇది, అన్తరాభవసత్త్వే=అంతరపిశాచమునకును, అశ్వే=గుఱ్ఱమునకును, దివ్యగాయనే = దేవలోకమునందు పాడునట్టి విశ్వావసువు మొదలయినవారికిని పేరు.

కమ్బు (ర్నా వలయే శఙ్ఖే)

కమ్బుః॥పు॥ఇది, వలయే=కడియమునకును, శఙ్ఖే=శంఖమునకును పేరు. [కొం=కొండెగానికిని పేరు.

ద్విజిహ్వా (సర్పసూచకౌ)

ద్విజిహ్వః॥పు॥ఇది, సర్పః=సర్పమునకును, సూచ

చకౌ). పూర్వోఽన్య లిఙ్గః ప్రాగాహ పుంబహుత్వేఽపి పూర్వజాన్),

పూర్వః॥ ఇది, ప్రాక్ = పూర్వదిక్కునకును వస్తువునకును, పూర్వకాలమునందుండు వస్తువునకును పేరు. అపుడు విశేష్యలింగము, పూర్వజాన్ ఆహ=పూర్వులయిన పితృపితామహులకు పేరైనపుడు, పుంబహుత్వేఽపి=పుంలింగబహువచనములయందవర్తించును. గంధర్వజిహ్వపూర్వశబ్దములు 'నబయోరభేదః' అనుటచేత నీబాంతములయందుఁ జెప్పఁబడినవి.

ఇతి బాన్తాః.

బయనునక్షరము తుదనుగల నానార్థశబ్దములు ముగిసెను.

కుమ్భౌ (ఘటేభమూర్ధాంశౌ)

కుమ్భః॥పు॥ఇది, ఘట = కడవకును, మూర్ధాంశౌ=ఏనుఁగు కుంభస్థలమునకును పేరు.

(డిమ్భౌతు శిశు బాలిశౌ). ౨౯౦

డిమ్భః॥పు॥ఇది, శిశు=శిశువునకును, బాలిశ=మూర్ఖునికిని పేరు.

స్తమ్భౌ (స్థూణా జడీభావౌ)

స్తమ్భః॥పు॥ ఇది, స్థూణా=కంబమునకును జడీభావౌ=మాౖన్పడియుండుటకును పేరు.

శమ్భూ (బ్రహ్మత్రిలోచనౌ),

శమ్భుః ॥పు॥ ఇది, బ్రహ్మ = బ్రహ్మకును త్రిలోచనౌ=శివునికిని పేరు.

(కుక్షి భ్రూణ అర్భకౌ) గర్భౌ

గర్భః॥పు॥ఇది, కుక్షిభ్రూణ = కడుపులోని శిశువునకును, అర్భకౌ=బాలునికిని పేరు.

విస్రమ్భః (ప్రణయే ఽపిచ). ౨౯౧

విస్రమ్భః॥పు॥ఇది, ప్రణయేచ=పరిచయమునకును, అపిశబ్దమువలన క్రీడాకలహమునకును విశ్వాసమునకును, కలహించుటకును పేరు.

(స్యాద్భేర్యాం) దున్దుభిః (పుంసిస్యాదక్షే) దున్దుభిః (స్త్రియామ్),

దున్దుభిః॥ఇది, భేర్యామ్=భేరికి పేరయినపుడు ॥పు॥, అక్షే=పాచికలయందుండు ఇత్తిగలనపుడు॥స్త్రీ॥, అక్షమనఁగా పాచికలని కొందరు.

(స్యాన్మహారజనే క్లీబం) కుసుమ్భం (కరకే పుమాన్). ౨౯౨

కుసుమ్భః॥ఇది, మహారజనే = కుసుమపూవునకు పేరైనపుడు ॥న॥, కరకే=కమండలమునకు పేరైనపుడు ॥పు॥.

క్షత్త్రియేఽపిచ) నాభి (ర్నా)

నాభిః॥ ఇది, క్షత్త్రియేచ = క్షత్త్రియునికిని, అపిశబ్దమువలన విజిగీషుఁడైన రాజునకును పేరైనపుడు ॥పు॥ బొడ్డునకు పేరైనపుడు ॥పు॥, బండికంటినడిమికిని, ప్రధానమునకును, కస్తూరికిని పేరైనపుడు॥సీ॥,

సురభి (ర్గవిచస్త్రియామ్),

సురభిః॥ ఇది, గవి = ఆవునకు పేరగునపుడు ॥సీ॥, చకారమునవలన వసంతర్తువునకు పేరైనపుడు॥పు॥, మంచిపరిమళముగలదానికిని,మనోహరమైనదానికిని పేరైనపుడు॥త్రి॥.

సభా (సంసది సభ్యేచ)

సభా ॥సీ॥ ఇది, సంసది = ఆస్థానమునకును, సభ్యే=సజ్జనునికిని, చకారమువలన సమూహమునకును, శాలకును, ద్యూతమునకును పేరు.

(త్రిష్వధ్యక్షేఽపి) వల్లభః. ౨౯౩

వల్లభః॥త్రి॥ ఇది, అధ్యక్షే=అధ్యక్షునికిని, అపిశబ్దమువలన ప్రియమైనదానికిని పేరు.

ఇతి భాన్తాః.

భ యనునక్షరము తుదనుగల నానార్థకశబ్దములు ముగిసెను.

(కిరణప్రగ్రహౌ) రశ్మీ

రశ్మిః ॥పు॥ ఇది, కిరణ=కిరణమునకును, ప్రగ్రహౌ=పగ్గమునకును పేరు. [ప్పకును పేరు.

(కపిభేకౌ) ప్లవఙ్గమౌ,

ప్లవఙ్గమః ॥పు॥ ఇది, కపి=కోఁతికిని, భేకౌ=క

(ఇచ్ఛా మనోభవౌ) కామౌ

కామః॥పు॥ఇది,ఇచ్ఛా=ఇచ్ఛకు,మనోభవౌ=మన్మథునికిని పేరు. మిక్కిలియనునర్థమున ॥న॥.

(శౌర్యోద్యోగౌ) పరాక్రమౌ. ౨౯౪

పరాక్రమః ॥పు॥ ఇది, శౌర్య=భయహేతువు కలుగుచున్నప్పటికిని భయములేక యుండుటకును, ఉద్యోగౌ=చేయవలయుపనులం బ్రారంభించుటకును పేరు.

ధర్మాః (పుణ్య యమ న్యాయ స్వభావాఽఽచార సోమపాః),

ధర్మః॥పు॥ఇది, పుణ్య=పుణ్యమునకును, యమ=యమునికిని, న్యాయ=నీతికిని, స్వభావ=స్వభావమునకును,ఆచార=ఆచారమునకును, సోమపా=సోమయాజికిని [?] యజ్ఞమునకును పేరు.

| | |
|---|---|
| (ఉపాయపూర్వ ఆరమ్భ ఉపధాచా) ప్యుప క్రమః. ౨౯౫ | ఉపక్రమః॥పు॥ఇది, ఉపాయపూర్వఆరమ్భః= ఉపాయము నెఱిఁగియారంభించుటకును, ఉపధాచ=అమాత్యాదులను పరీక్షించుటకును, అపి శబ్దమువలన నిదిమొదలని చెప్పుటకును పేరు. |
| వణిక్పథః పురం వే (దో నిగమో) | నిగమః॥పు॥ఇది, వణిక్పథః=అంగడివీథికిని, పురమ్=పట్టణమునకును, వేదః=వేదమునకును పేరు. |
| (నాగరోవణిక్), నైగమౌ (ద్వౌ) | నైగమః ॥పు॥ ఇది, నాగరః = పట్టణమున నున్నవానికిని, వణిక్=వర్తకునికిని పేరు. |
| (బలే) రామో (నీల చారు సితే త్రిషు). ౨౯౬ | రామః॥ ఇది, బలే=బలభద్రునికి పేరైనప్పుడు ॥పు॥, నీల=నల్లనిదానికిని, చారు=ఒప్పిదానికిని, సితే=తెల్లనిదానికిని పేరైనపుడు ॥త్రి॥ |
| (శబ్దాదిపూర్వో బృందే ఽపి) గ్రామః | గ్రామః ॥పు॥ ఇది, శబ్ద=శబ్దము, ఆది = మొదలైనశబ్దములు, పూర్వః=పూర్వమందుగల సమూహమునకును పేరు'శబ్దగ్రామః-గుణగ్రామః' అని అపిశబ్దమువలన ఊరికిని, సర్వసమూహమునకును పేరు. |
| (క్రాన్తౌచ) విక్రమః, | విక్రమః ॥పు॥ ఇది, క్రాన్తౌ=ఆక్రమించుటకును, చకారమువలనపరాక్రమమునకును పేరు. |
| స్తోమః (స్తోత్రే ఽధ్వ రే బృందే) | స్తోమః॥పు॥ ఇది, స్తోత్రే = స్తోత్రమునకును అధ్వరే=యాగమునకును, బృన్దే = సమూహమునకును పేరు. [అలసే=మందమైన దానికిని పేరు. |
| జిహ్మః (స్తుకుటి లేఽలసే). | జిహ్మః॥పు॥ఇది, కుటిలే=వంకరయైనదానికిని |
| గుల్మః(రుక్ స్తమ్బ సేనాశ్చ) | గుల్మః॥పు॥ఇది, రుక్=గుల్మరోగమునకును స్తమ్బ=పొదకును, సేనాః=సేనావిశేషమునకును, చకారమువలన ఉక్కళము మొదలైన దానికిని పేరు. |
| జామిః స్వసృకుల స్త్రియోః). ౨౯౭ | జామిః [పా] యామిః ॥స్త్రీ॥ ఇది, స్వసృ తోడఁబుట్టినదానికిని, కులస్త్రియోః = కులస్త్రీకిని పేరు. జామి ॥అవ్య॥- ఆలస్యము పేరందురు |

(క్షితిక్షాన్త్యోః) క్షమా(యుక్తే) క్షమం (శక్తే హితే త్రిషు),

క్షమా॥ఇది, క్షితి=భూమికిని, క్షాన్త్యోః=ఓర్పునకును పేరయినపుడు॥స్త్రీ॥, యుక్తే=ఉచితము యినదానికి పేరయినపుడు॥న॥[ప] అ॥,శక్తే=సమర్థునికిని,హితే=హితునికిని పేరయినపుడు॥త్రి॥.

(త్రిషు) శ్యామా (హరిత్కృష్ణౌ) శ్యామా (స్యాచ్ఛారిబానిశా)

శ్యామః॥ఇది,హరిత్=పచ్చనిదానికిని,కృష్ణౌ=నల్లనిదానికిని పేరయినపుడు॥త్రి॥ శారిబా=సుగంధపాలకును, నిశా=రాత్రికిని పేరైనపుడు॥స్త్రీ॥

లలామం (పుచ్ఛపుణ్డ్రాశ్వభూషాప్రాధాన్యకేతుషు),

లలామమ్[ప] లామ॥న్-న॥ఇది,పుచ్ఛ=తోకకును,పుణ్డ్రి=తిలకమునకును, అశ్వభూషా=గుఱ్ఱముయొక్క యాభరణమునకును, [ప] అశ్వ=గుఱ్ఱమునకును, భూషా=ఆభరణమునకును, ప్రాధాన్య=ప్రధానమైనదానికిని, కేతుషు=టెక్కెమునకును పేరు.

సూక్ష్మ (మధ్యాత్మమప్యా)

సూక్ష్మమ్॥త్రి॥ఇది, అధ్యాత్మ = పరమాత్మకును, అవిశబ్దమువలన స్వల్పమైనదానికిని పేరు.

(దా ప్రధానే) ప్రథమం (త్రిషు). ౨౯౯

ప్రథమమ్॥త్రి॥ఇది, ఆదౌ=మొదటిదానికిని, ప్రధానే=ముఖ్యమయినదానికిని పేరు.

వామౌ (వల్గుప్రతీపౌ ద్వౌ)

వామః॥త్రి॥ఇది, వల్గు=మనోహరమయినదానికిని, ప్రతీపౌ=ప్రతికూలమయిన దానికిని పేరు.

అధమౌ (న్యూనకుత్సితౌ),

అధమః॥త్రి॥ఇది, న్యూన=కొదువయైనదానికిని, కుత్సితౌ=నిందింపఁబడినదానికిని పేరు.

(జీర్ణం చ పరిభుక్తం చ) యాతయామ (మిదం ద్వయమ్). ౩౦౦

యాతయామమ్॥త్రి॥ఇది, జీర్ణంచ=చివికినదానికిని, పరిభుక్తంచ = అనుభవింపఁబడిన దానికిని పేరు.

ఇతి మాన్తాః.

మ యనునక్షరముతుదనుగల నానార్థకశబ్దములు ముగిసెను.

(తురఙ్గగరుడౌ) తార్క్ష్యౌ

తార్క్ష్యః॥పు॥ ఇది, తురఙ్గ=గుఱ్ఱమునకును, గరుడౌ=గరుడునికిని పేరు.

(నిలయాపచయౌ) క్షయౌ

క్షయః॥పు॥ఇది, నిలయ=ఇంటికిని, అపచ

యా,
శ్వశుర్యో (దేవరస్యా
లౌ)
భ్రాతృవ్యో (భ్రాతృ
జద్విషౌ). ౩౦౧
పర్జన్యౌ (రసదబ్దేన్ద్రౌ)

యా=నాశమునకును పేరు.

శ్వశుర్యః॥పు॥ఇది, దేవర=మగనితోడఁబుట్టిన వానికిని,స్యాలౌ=ఆలితోడఁబుట్టిన వానికిని పేరు.

భ్రాతృవ్యః ॥పు॥ ఇది, భ్రాతృజ=తోడఁబుట్టినవానికొడుకునకును, ద్విషౌ=పగవానికిని పేరు.

పర్జన్యః॥పు॥ఇది,రసత్=ఉఱుముచున్న, అబ్ద=మేఘమునకును, ఇన్ద్రౌ=ఇంద్రునికిని పేరు.

(స్యా)దర్యః(స్వామివై
శ్యయోః),
తిష్యః (పుష్యే కలి
యుగే)

అర్యః॥పు॥ఇది, స్వామి=ప్రభువునకును, వైశ్యయోః=వైశ్యునికిని పేరు.

తిష్యః॥పు॥ఇది, పుష్యే=పుష్యనక్షత్రమునకును, కలియుగే=కలియుగమునకును పేరు.

పర్యాయో (ఽవసరే
క్రమే). ౩౦౨
ప్రత్యయో(ఽధీనశప
థ జ్ఞాన విశ్వాస హేతు
షు, రంధ్రే శబ్దే)ఽ

పర్యాయః ॥పు॥ ఇది, అవసరే=అవసరమునకును, క్రమే=వరుసకును పేరు.

ప్రత్యయః॥పు॥ఇది, అధీన=అధీనమునకును, శపథ=శపథమునకును, జ్ఞాన=తెలివికిని, విశ్వాస=విశ్వాసమునకును, హేతుషు=హేతువులకును, రంధ్రే=అవకాశమునకును, శబ్దే=[illegible]ములు మొదలైన ప్రత్యయములకును పేరు.

అనుశయో (దీర్ఘ ద్వే
షానుతాపయోః).౩౦౩
స్థూలోచ్చయ (స్త్వ
సాకల్యే గజానాం మ
ధ్యమే గతే),

అనుశయః॥పు॥ఇది,దీర్ఘ ద్వేష=దీర్ఘ ద్వేషమునకును,అనుతాపయోః=పశ్చాత్తాపమునకును పేరు.

స్థూలోచ్చయః॥పు॥ఇది, అసాకల్యే=సమగ్రము కాకుండుటకును, గజానామ్=ఏనుగుల యొక్క,మధ్యమే=నడితరమయిన, గతే=(... మును మందముగాని) గమనములకును పేరు.

సమయా (శ్శపథాఽ
చార కాల సిద్ధాన్తసం
విదః). ౩౦౪

సమయః॥పు॥ఇది, శపథ=శపథమునకును, ఆచార=ఆచారమునకును, కాల=కాలమునకును, సిద్ధాన్త=సిద్ధాంతమునకును, సంవిదః=సంకేతమునకును పేరు. సంవిత్తనఁగా జ్ఞానము మొదలైనది.

(వ్యసనా న్యశుభం దైవం విపది) త్వనయా (స్త్రయః),

అనయః ॥పు॥ ఇది, వ్యసనాని = జూదము మొదలైన సప్తవ్యసనములకును, అశుభం దైవమ్=పూర్వజన్మమునం జేసిన యశుభకర్మమునకును, విపత్ =ఆపదకును పేరు.

అత్యయో (ఽతిక్రమే కృచ్ఛ్రే) దోషే దణ్డేఽప్య)

అత్యయః ॥పు॥ ఇది, అతిక్రమే=అతిక్రమించుటకును, కృచ్ఛ్రే=దుఃఖమునకును, దోషే = దోషమునకును, దణ్డే=దండమునకును, అపిశబ్దమువలన నాశమునకును పేరు.

(థాఽపది. ౩౦౭. యుద్ధాయత్యో) స్సమ్పరాయః

సమ్పరాయః ॥పు॥ ఇది, ఆపది=ఆపదకును, యుద్ధ-యుద్ధమునకును, ఆయత్యోః=భవిష్యత్కాలమునకును పేరు.

పూజ్య స్తు (శ్వశురేఽపిచ),

పూజ్యః॥పు॥ఇది, శ్వశురేచ = మామకును, అపిశబ్దమువలన పూజార్హునికి పేరు.

(పశ్చాదవస్థాయి బలం సమవాయశ్చ) సన్నయః. ౩౦౮

సన్నయః ॥పు॥ ఇది, పశ్చాత్ అవస్థాయి బలమ్=సేనకు వెనుకనుండు దుముదారిపౌజునకును, సమవాయః = సమూహమునకును, చకారమువలన సంబంధమునకును పేరు.

(సంఘాతే సన్నివేశేచ) సంస్త్యాయః

సంస్త్యాయః ॥పు॥ ఇది, సఙ్ఘాతే = సమూహమునకును, సన్నివేశే=ఊరిచుట్టునుండు బయలునకును [వ] అవయవసంస్థానవిశేషమునకును, చకారమువలన గృహమునకును పేరు.

ప్రణయా (స్త్వమీ, విస్రమ్భ యాచ్ఞా ప్రేమాణః)

ప్రణయః ॥పు॥ ఇది, విస్రమ్భ=విస్రంభమునకును, యాచ్ఞా=అడుగుటకును, ప్రేమాణః= ప్రేమకును పేరు. విస్రంభమనఁగా విశ్వాసమని కొందఱు, పరిచయమని కొందఱు.

(విరోధేఽపి) సముచ్ఛ్రయః. ౩౦౯

సముచ్ఛ్రయః ॥పు॥ ఇది, విరోధే=వైరమునకును, అపిశబ్దమువలన పొడవునకును పేరు.

విషయో (యస్యయో జ్ఞాత స్తత్ర శబ్దాదికే

విషయః॥పు॥ఇది, యస్య=ఎవనిచేత, యః= ఏది, జ్ఞా[illegible] [illegible]వో, తత్ర=

| | |
|---|---|
| ష్వపి), | దానికిని, శబ్దాదికేషు=శబ్దస్పర్శ రూపరసగం ములకును, అపిశబ్దమువలన దేశమునకును పే |
| (నిర్యాసేఽపి) కషాయోఽ (స్త్రీ) | కషాయః ॥పు॥ ఇది, నిర్యాసే = కషా మునకును, అపిశబ్దమువలన ఒగరునకును, పూఁతకును, పరిమళించుదానికిని పేరు. |
| (సభాయాంచ) ప్రతిశ్రయః. 30౭ | ప్రతిశ్రయః ॥పు॥ ఇది, సభాయామ్ = స కును, చకారమువలన నునికిపట్టునకును, గృ హమునకును పేరు. |
| ప్రాయో (భూమ్న్యన్తగమనే) | ప్రాయః ॥పు॥ ఇది, భూమ్ని=బాహుళ్య నకును, అన్తగమనే=మరణార్థమై యాహార లేకయుండుటకును పేరు. ఇదిగాక సమాస నందుత్తరపదమయి సదృశార్థమగును. |
| మన్యు (ర్దైన్యే క్రతౌ క్రుధి), | మన్యుః॥పు॥ఇది,దైన్యే=దైన్యమునకును, క్ర తౌ=యజ్ఞమునకును, క్రుధి=కోపమునకును పే |
| (రహస్యోపస్థయో) ర్గుహ్యం | గుహ్యమ్॥ఇది, రహస్య=దాఁచఁదగినదా పేరైనపుడు॥త్రి॥, ఉపస్థయోః=స్త్రీపురుషగుహ్య వయవములకు పేరైనపుడు ॥న॥, తాఁబేటికి |
| సత్యం (శపథతథ్యయోః). 30౮ | సత్యమ్॥ఇది, శపథ=ఆనకు పేరైనపుడు తథ్యయోః = నిజమునకు పేరైనపుడు॥త్రి॥, య గభేదలోకభేదములకును పేరనికొందఱు. |
| వీర్యం (బలే ప్రభావే చ) | వీర్యమ్॥న॥ఇది, బలే = సత్తువకును, ప్ర వే=ద్రవ్యశక్తికిని, చకారమువలన రేతస్సు కును, తేజస్సునకును పేరు. |
| ద్రవ్యం (భవ్యేగుణాశ్రయే), | ద్రవ్యమ్ ॥న॥ఇది, భవ్యే=మంచిపదార్థము కును, గుణాశ్రయే=గుణాశ్రయమైన వస్తు కును పేరు. భవ్యుఁడనఁగా భాగ్యసంపన్నుఁడు యు, యోగ్యుఁడనియు కొందఱు. |
| ధిష్ణ్యం (స్థానేగృహే భేఽగ్నౌ) | ధిష్ణ్యమ్॥ఇది,స్థానే=తావునకును, గృహే నకును, భేఽగ్నౌ=నక్షత్రమునకును పేరయి |

॥న॥, అగ్నౌ=అగ్నికిపేరయినపుడు॥పు॥.

భాగ్యం (కర్మ శుభాశుభమ్). ౩౧౦

భాగ్యమ్॥న॥ఇది, శుభాశుభమ్=శుభమును అశుభమునైన, కర్మ=కర్మమునకును పేరు.

(కశేరుహేమ్నో) ర్గాఙ్గేయం

గాఙ్గేయమ్॥న॥ఇది, కశేరు = తామరకలువ మొదలయినదానిదుంపకును, హేమ్నః=బంగారమునకును పేరు.

విశల్యా (దన్తికాऽపిచ),

విశల్యా॥స్త్రీ॥ఇది,దన్తికాచ=దంతిచెట్టునకును, అపిశబ్దమువలనపాపరచెట్టునకును, తటిగొట్టుచెట్టునకును, నాఁగేటిచాలికూరకును పేరు.

వృషాకపాయీ (శ్రీగౌర్యో)

వృషాకపాయీ॥స్త్రీ॥ ఇది, శ్రీ=లక్ష్మికిని, గౌర్యోః=పార్వతికిని పేరు.

రభిఖ్యా (నామశోభయోః). ౩౧౧

అభిఖ్యా ॥స్త్రీ॥ ఇది, నామ = నామధేయమునకును, శోభయోః=కాంతికిని పేరు.

(ఆరమ్భో నిష్కృతిశ్శిక్షా పూజనం సంప్రధారణమ్, ఉపాయః కర్మ చేష్టాచ చికిత్సాచ నవ) క్రియాః. ౩౧౨

క్రియాః॥స్త్రీ॥ఇది,ఆరమ్భః=ఉద్యోగమునకును, నిష్కృతిః=ప్రాయశ్చిత్తమునకును, శిక్షా=శిక్షకును, పూజనమ్=పూజనమునకును, సంప్రధారణమ్=వ్యవహారమునందు నిశ్చయమును బుట్టించులిఖితసాక్ష్యాదులకును, ఉపాయః = ఉపాయమునకును, కర్మ=వ్యాపారమునకును, చేష్టా = బుద్ధిపూర్వకవ్యాపారమునకును, చికిత్సా = చికిత్సకును, నవ=ఈతొమ్మిదింటికిని, చకారమువలన ధాత్వర్థము మొదలయినదానికిని పేరు.

ఛాయా (సూర్యప్రియా కాన్తిః ప్రతిబిమ్బమనాతపః),

ఛాయా॥స్త్రీ॥ఇది, సూర్యప్రియా = సూర్యుని భార్యకును, కాన్తిః=కాంతికిని, ప్రతిబిమ్బమ్=ప్రతిబింబమునకును, అనాతపః=నీడకును పేరు.

కక్ష్యా (ప్రకోష్ఠే హర్మ్యాదేః కాఞ్చ్యాం మధ్యేభబన్ధనే). ౩౧౩

కక్ష్యా॥స్త్రీ॥ఇది,హర్మ్యాదేః=మేడలు మొదలైనరాజగృహములయొక్క, ప్రకోష్ఠే=అంతరువులకును,కాఞ్చ్యామ్=మొలనూలికిని, మధ్యేభబన్ధనే=ఏనుఁగునడుమునకట్టెడుపట్టెడకును పేరు.

| | |
|---|---|
| కృత్యా (క్రియా దేవ తయో స్త్రీషు భేద్యే ధనాదిభిః), | కృత్యా॥ ఇది, క్రియా=చేయుటకును, దేవ తయోః = దేవతావిశేషమునకును పేరయినపుడు ॥స్త్రీ॥, ధనాదిభిః=ధనాదుల చేత, భేద్యే= లోబఱచుకొనందగిన పరరాష్ట్రరాజులు మొదలయిన వారికి పేరైనపుడు॥త్రి॥. |
| జన్యం (స్యాజ్జనవాదే ఽపి) | జన్యమ్॥ ఇది, జనవాదే=లోకాపవాదమునకును, అపిశబ్దమువలనయుద్ధమునకును పేరైనపుడు॥త్రి॥ పెండ్లికొడుకు చెలికాండ్రకును, పెండ్లికోమరితభృత్యాదులకును, తండ్రికిని పేరైనపుడు॥పు॥. |
| జఘన్యో ఽ (న్త్యే ఽధ మే ఽపిచ). 3౧౮ | జఘన్యః॥త్రి॥ఇది, అన్త్యే = వెనుకబుట్టినవానికిని, అధమేచ=అధమునికిని, అపిశబ్దమువలన తోఁక గోనిసె శిశ్నములకును పేరు. |
| (గర్హ్యాధీనౌచ) వక్తవ్యౌ | వక్తవ్యః॥త్రి॥ఇది, గర్హ్యే = కుత్సితునికిని, అధీనే = చెప్పినట్టుచేయువానికిని, చకారమువలన పలుకందగిన శబ్దములకును పేరు. |
| కల్యౌ (సజ్జ నిరామయా), | కల్యః॥త్రి॥ ఇది, సజ్జ=సంపాదింపఁబడినదానికిని, నిరామయా=రోగములేనిదానికిని పేరు. |
| (ఆత్మవా ననపేతో ఽర్థా) దర్థ్యౌ | అర్థ్యః॥త్రి॥ఇది, ఆత్మవాన్=ఎఱుకగలవానికిని, అర్థాత్ =అర్థమువలన, అనపేతః= ఎడఁబాయనివానికిని పేరు |
| పుణ్యం (తు చార్వపి). 3౧౯ | పుణ్యమ్॥న॥ఇది, చారు = ఒప్పెడిదానికిని అపిశబ్దమువలన సుకృతమునకును పేరు. |
| రూప్యం (ప్రశస్తరూపేఽపి) | రూప్యమ్॥ ఇది, ప్రశస్తరూపే=సౌందర్యముగలదానికిపేరయినపుడు॥త్రి॥, అపిశబ్దమువలన ముద్ర వేసినబంగారునకును, వెండికిని పేరైనపుడు॥న॥ |
| వదాన్యో (వల్గువా గపి), | వదాన్యః॥త్రి॥ఇది, వల్గువాక్ =లెస్సగామాటలాడువానికిని, అపిశబ్దమువలనదాతకును పేరు. |
| (న్యాయ్యే ఽపి) మధ్యౌ | మధ్యః॥త్రి॥ఇది,న్యాయ్యే = ఉచితమైనదానికిని అపిశబ్దమువలననడుమునకు పేరైనపుడు॥పు॥ |

సామ్యంతు (సున్దరే సోమదైవతే). ౩౧౬

సామ్యమ్॥ తి॥ ఇది, సున్దరే = ఒప్పిదుదానికిని, సోమదైవతే=సోముఁడు దేవతగాఁ గలహవిస్సూక్తములకును పేరు.

ఇతి యాన్తాః

య అనునక్షరము తుదనుగల నానార్థక శబ్దములు ముగిసెను.

(నివహావసరౌ) వారౌ

వారః॥పు॥ఇది, నివహ=సమూహమునకును, అవసరౌ=అవసరమునకును పేరు.

సంస్తరౌ (ప్రస్తరాధ్వరౌ),

సంస్తరః॥పు॥ఇది, ప్రస్తర=దర్భాదులచేతఁ జేయఁబడినపాన్పునకును, అధ్వరౌ=యజ్ఞమునకును పేరు.

గురూ (గీష్పతి పిత్రాద్యౌ)

గురుః॥పు॥ఇది, గీష్పతి=బృహస్పతికిని పిత్రాద్యౌ=తండ్రి మొదలయినపూజ్యులకును, భారవస్తువునకును పేరు.

ద్వాపరౌ (యుగసంశయౌ). ౩౧౭

ద్వాపరః॥పు॥ఇది, యుగ=మూఁడవయుగమునకును, సంశయౌ=సంశయమునకును పేరు.

ప్రకారౌ (భేదసాదృశ్యే)

ప్రకారః॥పు॥ఇది, భేద=భేదమునకును, సాదృశ్యే=పోలికకును పేరు.

ఆకారా (వింగితాకృతీ),

ఆకారః॥పు॥ ఇది, ఇంగిత=అభిప్రాయసూచకమయినచేష్టకును, ఆకృతీ=అభిప్రాయ సూచకమయిన ముఖరాగాదివికారమునకును పేరు.

కింశారూ (ధాన్యశూకేషూ)

కింశారుః॥పు॥ ఇది, ధాన్యశూక=వరిముంటికిని, ఇషూ=బాణమునకును పేరు.

మరూ (ధన్వ ధరాధరౌ). ౩౧౮

మరుః ॥పు॥ఇది, ధన్వ=నిర్జలభూమికిని, ధరాధరౌ=పర్వతమునకును పేరు.

అద్రయో (ద్రుమశైలార్కాః)

అద్రిః॥పు॥ఇది, ద్రుమ=వృక్షమునకును, శైల=పర్వతమునకును, అర్కాః=సూర్యునికిని పేరు.

(స్త్రీస్తనాబ్దౌ) పయోధరౌ,

పయోధరః॥ పు॥ఇది, స్త్రీస్తన=స్త్రీస్తనమునకును, అబ్దౌ=మేఘమునకును పేరు.

(ధ్వాన్తారి దానవా

వృత్రః॥పు॥ఇదు, ధ్వాన్త=చీకటికిని, అరిశత్రు

వృత్రా | వునకును, దానవాః=వృత్రాసురునికిని పేరు.

(బలి హస్తాంశవః) కరాః. 3౧౮ | కరః॥పు॥ఇది, బలి=అప్పనమునకును, హస్త=చేతికిని, అంశవః=కిరణమునకును పేరు.

ప్రదరా (భఙ్గనారీరుగ్బాణా) | ప్రదరః॥పు॥ఇది, భఙ్గ=విఱుచుటకును, నారీరుక్=స్త్రీలయొక్క రక్తస్రావవ్యాధికిని, బాణాః=అమ్మునకును పేరు.

అస్రాః (కచా అపి), | అస్రః[పా]ఆస్రః॥పు॥ఇది, కచాః=వెండ్రుకలకు పేరు, అపిశబ్దమువలన నెత్తురునకును, కన్నీళ్లకును పేరయినపుడు॥న॥.

(అజాతశృంగో గౌః కాలేఽప్యశ్మశ్రుర్నా చ) తూబరః. 3౨౦ | తూబరః॥పు॥ఇది, కాలే=కాలమునందు, అజాతశృఙ్గః=కొమ్ములురాని, గౌః=ఎద్దునకును, అశ్మశ్రుః=గడ్డముమీసమురానిపురుషునికిని పేరు.

(స్వర్ణేఽపి) రాః | రాః॥ఐ-పు॥ఇది, స్వర్ణే=బంగారునకును, అపిశబ్దమువలన పదార్థమునకును పేరు.

పరికరః (పర్యఙ్కపరివారయోః), | పరికరః॥పు॥ఇది, పర్యఙ్క=మంచమునకును, పరివారయోః=పరివారమునకును పేరు.

(ముక్తాశుద్ధౌ చ) తారః (స్యాత్) | తారః॥పు॥ఇది, ముక్తాశుద్ధౌ=ముత్యాలశుద్ధికి పేరు. చకారమువలన నక్షత్రమునకును, కనుగ్రుడ్డునకును పేరయినపుడు॥స్త్రీ॥, గొప్పధ్వనికి పేరయినపుడు॥త్రి॥.

శారో (వాయౌ స తు త్రిషు. 3౨౧. కర్బురే) | శారః॥ఇది, వాయౌ = వాయువునకు పేరయినపుడు॥పు॥, కర్బురే=నానావర్ణములుగలవానికి పేరయినపుడు॥త్రి॥.

(ప్రతిజ్ఞాజి సంవిదాపత్సు) సఙ్గరః, | సఙ్గరః॥పు॥ ఇది, ప్రతిజ్ఞా=ప్రతిజ్ఞకును, ఆజి=యుద్ధమునకును, సంవిత్=క్రియాసిద్ధ్యాయమునకును, ఆపత్సు=ఆపదకును పేరు.

(వేదభేదే గుప్తవాదే మన్త్రో) | మన్త్రః॥పు॥ ఇది, వేదభేదే=గాయత్ర్యాదివేదమంత్రములకును, గుప్తవాదే=రహస్యాలోచనమునకును పేరు.

మిత్రో (రవావపి) 3_౨౨

మిత్రః॥ఇది, రవౌ=సూర్యునికిని పేరై నపుంసు ॥పు॥అపిశబ్దమువలనచెలికానికిని పేరై నపుడు ॥న॥.

(మఖేషు యూపఖణ్డేఽపి) స్వరు

స్వరుః॥పు॥ఇది, మఖ=యజ్ఞమునకును, ఇషుః= బాణమునకును, యూపఖణ్డే=యూప స్తంభము యొక్క తునుకకును, అపిశబ్దమువలన వజ్రాయుధ మునకును పేరు.

(గుహ్యే) ప్యవస్కరః,

అవస్కరః॥పు॥ఇది, గుహ్యే=స్త్రీపురుషుల గుహ్యప్రదేశమునకును, అపిశబ్దమువలన మల మునకును, కడవయడుగుఅంట్లకును పేరు.

ఆడమ్బర [స్తూర్యరవే గజేన్ద్రాణాంచగర్జితే). 3_౨౩

ఆడమ్బరః॥పు॥ఇది,తూర్యరవే=వాద్యధ్వనికిని, గజేన్ద్రాణాం=ఏనుఁగులయొక్క, గర్జితే=గర్జించు టకును, చకారమువలనసంరంభమునకును పేరు.

అభిహారో (ఽభియోగేచ చౌర్యే సన్నహనేఽపిచ),

అభిహారః॥పు॥ఇది, అభియోగే=అపకారము చేయుటకొఱకు నెదిరించియాక్రమించుటకును, చౌర్యే=దొంగిలించుటకును, సన్నహనే=ఆయ త్తపడుటకును పేరు.

(స్యాజ్జఙ్గమే)పరీవారః (ఖడ్గకోశే పరిచ్ఛదే). 3_౨౪

పరివారః॥పు॥ఇది,జంగమే=తిరుగుప్రాణికిని, ఖ డ్గకోశే=కత్తిఒఱకును, పరిచ్ఛదే=పరిజనమున కును పేరు.

విష్టరో (విటపీదర్భముష్టిఃపీఠాద్యమాసనమ్),

విష్టరః॥పు॥ఇది, విటపీ=వృక్షమునకును,దర్భ ముష్టిః=దర్భపిడికిలికిని, పీఠాద్యంఆసనమ్=పీట మొదలయినయాసనములకును పేరు.

(ద్వారిద్వార్స్థే) ప్రతీహారః (ప్రతిహార్యప్యనన్తరే). 3_౨౫

ప్రతీహారః॥పు॥ఇది,ద్వారి=వాకిలికిని, ద్వార్స్థే= వాకిటికావలివానికిని పేరు. అనన్తరే=వాకిటికావ లివానికి, ప్రతిహారీ॥న్॥ - అనురూపమునుగలదు, వాకిలిగాచు స్త్రీకి, ప్రతిహారీ॥స్త్రీ॥ అనిపేరుగలదు.

(విపులే నకులే విష్ణౌ బభ్రు (స్సాన్పిఙ్గళేత్రిషు),

బభ్రుః॥ ఇది, విపులేనకులే=గొప్పముంగిసకు ను, విష్ణౌ=విష్ణువునకును పేరయినపుడు॥పు॥, పింగ ళే=వచ్చనిదానికి పేరయినపుడు॥త్రి॥.

సారో (బలే స్థిరాంశే చ న్యాయ్యే క్లీబం వరే త్రిషు). 3౨౬

సారః॥ఇది, బలే=సత్తువకును, స్థిరాంశే=స్థిరాంశమునకును పేరయినపుడు॥పు॥, న్యాయ్యే=యుక్తమునకు పేరయినపుడు॥న॥, వరే=శ్రేష్ఠమునకు పేరయినపుడు ॥త్రి॥.

దురోదరో (ద్యూతకారే పణే ద్యూతే దురోదరమ్).

దురోదరః॥ఇది, ద్యూతకారే=జూదమాడువానికి పేరయినపుడు॥పు॥, పణే=పందెమునకును, ద్యూతే=జూదమునకును పేరైనపుడు॥న॥

(మహారణ్యే దుర్గపథే) కాన్తారం (పున్నపుంసకమ్). 3౨౭

కాన్తారమ్॥పు॥ఇది, మహారణ్యే=దొడ్డయడవికిని, దుర్గపథే=పోవశక్యముకాని త్రోవకును పేరు.

మత్సరో (ఽన్యశుభద్వేషే తద్వత్కృపణయోస్త్రిషు),

మత్సరః॥ఇది, అన్యశుభద్వేషే=పరులమేలు చూడఁజాలమికి పేరయినపుడు॥పు॥, మత్సరము గలవానికిని, కృపణునికిని పేరయినపుడు॥త్రి॥

(దేవాద్వృతే) వర (శ్శ్రే)ష్ఠే త్రిషు క్లీబే మనాక్ప్రియే). 3౨౮

వరః॥ఇది, దేవాత్ వృతే=దేవతలవలనఁబొందఁబడినయభీష్టమునకు పేరయినపుడు॥పు॥, శ్రేష్ఠే=శ్రేష్ఠవస్తువునకు పేరయినపుడు॥త్రి॥, మనాక్ప్రియే = ఇంచుకంత ప్రియమయినదానికి పేరయినపుడు॥న॥ అపుడవ్యయ మని కొందఱు.

(వంశాఙ్కురే) కరీరో (ఽస్త్రీ తరుభేదే ఘటే చ నా),

కరీరః॥ఇది, వంశాఙ్కురే = వెదురుమొలకకు పేరయినపుడు॥పు॥, తరుభేదే=వెణుతురుచెట్టుకును, ఘటే=కడవకును పేరయినపుడు॥పు॥.

(నా చమూజఘనే హస్తసూత్రే) ప్రతిసరో (ఽస్త్రియామ్). 3౨౯

ప్రతిసరః॥ఇది, చమూజఘనే = సేనవెనుకదిక్కునకు పేరైనపుడు ॥పు॥హస్తసూత్రే=పెండ్లిలోఁగట్టుకంకణపుదారమునకు పేరయినపుడు॥ష॥

(యమానిలేన్ద్ర చన్ద్రార్క విష్ణుసింహాంశువాజిషు, శుకాహికపిభేకేషు) హరి (ర్నా కపిలే త్రిషు). 330

హరిః॥ఇది, యమ=యమునికిని, అనిల=వాయువునకును, ఇన్ద్ర=ఇంద్రునికిని, చన్ద్ర=చంద్రునికిని, అర్క=సూర్యునికిని, విష్ణు=విష్ణువునకును, సింహ=సింహమునకును, అంశు=కిరణమునకును, వాజిషు=గుఱ్ఱమునకును, శుక=చిలుక

కును, అహి=పామునకును, కపి=కోఁతికిని, భేకే షు=కప్పకును పేరయినవుడు॥పు॥,కపిలే=బంగారు చాయ గలదానికి పేరయినవుడు॥త్రి॥.

శర్కరా (కర్పరాంశే ఽపి)

శర్కరా॥సీ॥ఇది,కర్పరాంశే=పెంచునకును,అపిశ బ్దమువలన మొరపనేలకును, పంచదారకును పేరు.

యాత్రా (స్యాద్యాపనే గతౌ),

యాత్రా॥సీ॥ ఇది, యాపనే=భోజనము మొదలైనవర్తనలకును, గతౌ=గమనమునకును పేరు.

ఇరా (భూ వా క్సురా ఽప్సు స్యా)

ఇరా॥సీ॥ఇది, భూ=భూమికిని, వాక్=వాక్కునకును, సురా=మద్యమునకును, అప్సు = నీళ్లకును పేరు.

తన్ద్రీ (నిద్రా ప్రమీలయోః). ౩౩౧

తన్ద్రీ[సా]తన్ద్రా॥సీ॥ ఇది, నిద్రా = నిద్రకును, ప్రమీలయోః=ఒళ్లెఱుంగకుండుటకును పేరు.

ధాత్రీ (స్యాదుపమాతా ఽపి క్షితిర ప్యామలక్యపి),

ధాత్రీ॥సీ॥ఇది,ఉపమాతా=దాదికిని, క్షితిః= భూమికిని, ఆమలకీ=ఉసిరికచెట్టునకును పేరు.

క్షుద్రా(వ్యఙ్గా నటీ వేశ్యా సరఘా కణ్టకారికా. ౩౩౨. త్రిషు క్రూరే ఽధమే ఽల్పే ఽపి) క్షుద్రం

క్షుద్రా॥ఇది, వ్యఙ్గా=అంగహీనురాలికిని, నటీ=నాట్యమాడుస్త్రీకిని, వేశ్యా = వేశ్యకును, సరఘా= తేనెటీగకును, కణ్టకారికా = వాఁకుడు చెట్టునకును పేరయినవుడు॥సీ॥, క్రూరే=క్రూరునికిని,అధమే=అధమునికిని, అల్పే=కొంచెమైనదానికిని, అపిశబ్దమువలన కృపణునికిని పేరు.

మాత్రా (పరిచ్ఛేదే, అల్పేచ పరిమాణేచ) మాత్రం (కార్త్స్న్యే ఽవధారణే). ౩౩౩

మాత్రా॥ఇది,పరిచ్ఛదే = పరివారమునకును, అల్పే=కొంచెమునకును, పరిమాణే=కొలఁదికిని, చకారమువలన నక్షరావయవమునకును పేరైనవుడు॥సీ॥, కార్త్స్న్యే = సకలమునకు, అవధారణే = నిశ్చయమునకును పేరయినవుడు॥న॥.

(ఆలేఖ్యా ఽశ్చర్యయోః) శ్చిత్రం

చిత్రమ్॥న॥ఇది, ఆలేఖ్య = చిత్తరువునకును, ఆశ్చర్యయోః=అద్భుతమునకును పేరు.

కళత్రం (శ్రోణిభార్య

కళత్రమ్॥న॥ఇది, శ్రోణి=పిఱుఁదునకును, భా

| | |
|---|---|
| యోః), | ర్య యోః=పెండ్లమునకును పేరు. |
| (యో గ్య భా జ న యోః) పాత్రం | పాత్రమ్॥న॥ఇది, యోగ్య = యోగ్యునకు, భాజనయోః=భోజనపాత్రమునకును పేరు. ఇది గాక నద్యాదుల రెండుదరులనడిమికిని పేరు. |
| పత్త్రం (వాహనపక్ష యోః). 33౪ | పత్త్రమ్॥న॥ ఇది, వాహన = వాహనమునకును, పక్ష యోః=ఱెక్కకును పేరు. |
| (నిదేశ గ్రన్థ యో) శ్శాస్త్రం | శాస్త్రమ్॥న॥ ఇది, నిదేశ=ఆజ్ఞకును, గ్రన్థ యోః=వ్యాకరణాదిగ్రంథములకును పేరు. |
| శస్త్రి (మాయుధలోహయోః), | శస్త్రమ్॥న॥ఇది,ఆయుధ=ఆయుధమునకును, లోహ యోః=లోహమునకును పేరు. |
| (స్యా జ్జటా ంశుక యో) ర్నేత్రం | నేత్రమ్॥న॥ఇది,జటా=చెట్టువేరునకును, అంశుక యోః=వెలిపట్టు చీరకును పేరు. ఇదిగాక వ్వవుత్రాటికిని, కంటికిని పేరు. |
| క్షేత్రం (పత్నీ శరీర యోః). 33౫ | క్షేత్రమ్॥న॥ ఇది, పత్నీ = పెండ్లమునకును, శరీరయోః = దేహమునకును పేరు. ఇదిగాక మడికిని, సిద్ధస్థానమునకును పేరు. |
| (ముఖాగ్రే క్రోడహల యోః) పోత్రం | పోత్రమ్॥న॥ ఇది, క్రోడహల యోః ముఖాగ్రే=పందిమూతికిని నాగేటికొనకును పేరు. |
| గోత్రం (తు నామ్ని చ), | గోత్రమ్॥ఇది, నామ్ని=నామధేయమునకును, చకారమువలన కులమునకును, బలమునకును పేరైనపుడు ॥న॥, పర్వతమునకు పేరయినపుడు ॥పు॥, భూమికిని, గోసమూహమునకును పేరైనపుడు॥స్త్రీ॥. |
| సత్త్ర (మాచ్ఛాదనే యజ్ఞే సదా దానే వనే ఒపిచ). 33౬ | సత్త్రమ్॥న॥ఇది, ఆచ్ఛాదనే = గృహమునకును, యజ్ఞే=యజ్ఞవిశేషమునకును, సదాదానే=ఎడ తెగనియీవికిని, వనేచ=వనమునకును, అపి శబ్దమువలన డంభమునకును పేరు. |
| అజిరం (విషయే కాయే ఒపి) | అజిరమ్॥న॥ఇది, విషయే=శబ్దాదివిషయములకును, కాయే = శరీరమునకును, అపిశబ్ద |

| | |
|---|---|
| | వలన ముంగిలికిని పేరు. |
| మ్బరం (వ్యోమ్ని వాససి) | అమ్బరమ్॥న॥ఇది, వ్యోమ్ని=ఆకాశమునకును, వాససి=వస్త్రమునకును పేరు. |
| చక్రం (రాష్ట్రేఽప్య) | చక్రమ్॥ఇది, రాష్ట్రే=దేశమునకును, అపిశబ్దమువలన సైన్యమునకును, బండికంటికిని, గ్రామసమూహమునకును, కుమ్మరసానకును, ఆయుధవిశేషమునకును పేరయినపుడు॥న॥, చక్రవాకపక్షికిని, సమూహమునకును పేరయినపుడు॥పు॥. |
| క్షరం (తు మోక్షేఽపి) | అక్షరమ్॥న॥ ఇది, మోక్షే=మోక్షమునకును. అపిశబ్దమువలన అకారాదివర్ణములకును, పరబ్రహ్మకును పేరు. [వలన పాలకును పేరు. |
| క్షీర (మప్సుచ). 332 | క్షీరమ్॥న॥ఇది, అప్సు=నీళ్ళకును, చకారము |
| (స్వర్ణేఽపి) భూరి | భూరి॥ఇది, స్వర్ణే=బంగారమునకు పేరయినపుడు॥న॥, బహుళమునకు పేరయినపుడు॥త్రి॥. |
| చన్ద్రి (ద్వే) | చన్ద్రిమ్॥ ఇది, బంగారమునకు పేరయినపుడు ॥న॥[ప]॥పు॥, అపిశబ్దమువలన చంద్రునికిని, కర్పూరమునకును, కాంపిల్య మను గ్రంధ్యమునకును పేరయినపుడు॥పు॥. |
| (ద్వారమాత్రేఽపి) గోపురమ్, | గోపురమ్ ॥న॥ ఇది, ద్వారమాత్రే=వాకిలిమాత్రమునకును, అపిశబ్దమువలన పట్టణపువాకిటికిని, తుంగగడ్డలకును పేరు. |
| (గుహాదమ్భౌ) గహ్వరే ద్వే | గహ్వరమ్ ॥న॥ ఇది, గుహా=గుహకును, దమ్భః=కపటమునకును పేరు. |
| (రహోఽన్తిక) ముపహ్వరే 333 | ఉపహ్వరమ్॥న॥ఇది, రహః=ఏకాంతమునకును, అన్తికమ్=సమీపమునకును పేరు. |
| (పురోఽధిక ముప) ర్యగ్రా | అగ్రమ్॥ ఇది, పురః=ముందరికిని, అధికమ్=అధికమునకును, ఉపరి=మీఁదికిని పేరు. ఇదిగాక ప్రధానునికి పేరయినపుడు ॥త్రి॥, గ్రాసచతుష్టయప్రమాణముయిన భిక్షకు పేరయినపుడు ॥న॥. |

